S.V.Vedic University Series No:131
Research & Publications

# మణిమంజరి

## వాఙ్మయ, యోగ పరిశోధన పత్రిక

ప్రధాన సంపాదకులు
**ఆచార్య సన్నిధానం సుదర్శన శర్మ**
**కులపతులు**




శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయ పీఠం మరియు పరిశోధన కేంద్రం
**శ్రీవేంకటేశ్వరవేదవిశ్వవిద్యాలయము**
**తిరుపతి-517 502**

*Maṇimañjari*

Chief Editor : **Prof. S. Sudarsana Sarma**
Vice-Chancellor

Editor : **Dr. K. Tarakaramakumara Sarma**

Copies : **200**

Price : **Rs.190/-**



Produced by : **Sri Veturi Prabhakarasastri Vanjmayapeetam and Research Centre**

Published by : **The Registrar**
Sri Venkateswara Vedic University
Tirupati-517 502, Andhra Pradesh.

Published by : Sri Veturi Prabhakarasastri Vanjmayapeetam and Research Centre
Sri Venkateswara Vedic University

Email : svvupublications@gmail.com

Website : www.svvedicuniversity.ac.in

Phone : 0877 - 2264404

Printed at : Prajasakti Daily Printing Press, Renigunta Road, Tirupati.

# శ్రీ వేంకటేశ్వర వేదవిశ్వవిద్యాలయము



(తి.తి.దే. ప్రోత్సాహితము, యు.జి.సి.ద్వారా ఆమోదితము)
తిరుపతి.

ఆచార్య సన్నిధానం సుదర్శన శర్మ
కులపతులు

☎ 0877 - 2222586



## ముందుమాట

ఇటీవలి కాలంలో మనమెరింగిన మహనీయ సాహితీవేత్త కీర్తికాయులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ఆయనను సాహితీమూర్తి అనటంకన్నా పరిపూర్ణమైన సారస్వత మూర్తి అని అనడం సమంజసం. ఎందుకంటే ఒక సాహిత్యమేకాదు, యోగశాస్త్రం కాదు, ఛందశ్శాస్త్రం కాదు, వేదాంత దర్శనమే కాదు, కవిత్వమే కాదు, వచన రచనయే కాదు, పరిశోధనయే కాదు శాస్త్రిగారు స్పృశించని సారస్వత ప్రక్రియయే లేదు. అట్టి పండిత ప్రకాండులైన వీరియొక్క సారస్వతాన్ని మథించి అమృతబిందువులను అందజేయవలెననే సదుద్దేశంతో శ్రీశాస్త్రి గారి సుపుత్రులు శ్రీ వేటూరి ఆనందమూర్తి గారి సంకల్పముతో స్థాపింపబడిన ఒక పరిశోధనా పీఠము. తిరుమల తిరుపతి దేవస్థానం వారిచే నిర్వహింపబడుతూ ఉండేది.

కాలగతిలో కొంత కాలానికి ఆ పరిశోధనాపీఠం కార్యక్రమం నిద్రాణ స్థితికి చేరుకున్న కారణంగా దేవస్థానం వారు పునర్జాగృతం చేయుటకు వేదవిశ్వవిద్యాలయం వారికి అప్పజెప్పడం జరిగింది. అప్పటి నుండి వాఙ్మయ పీఠం కార్యక్రమం పునః ప్రారంభించే ప్రయత్నంలో వేద విశ్వవిద్యాలయం నిమగ్నమైంది.

అందులో భాగంగా, పన్నెండు సంచికలతో ఆగిపోయినట్టి శోధ సంచిక "మణిమంజరి" ని పునరారంభించడం సంతసాన్ని కలుగజేస్తుంది. ఈ పన్నెండవ సంచికలో పేరుకు తగ్గట్టుగా మణిపూసలవంటి పన్తొమ్మిది నిబంధనలు నిబంధింపబడియున్నవి. పరిశోధకులకు, పండితులకు ఈ సంచిక మహోపకారిగా ఉండగలదనటంలో ఎట్టి సంశయము లేదు. ఆ ఏడుకొండల వారి అనుగ్రహంతో ఈ పరిశోధనా కేంద్రంయొక్క కార్యక్రమము నిర్విఘ్నంగా కొనసాగాలని ప్రార్థిస్తూ పాఠకలోకానికి ఈ సంచికను సమర్పిస్తున్నాను.

తిరుపతి

సన్నిధానం సుదర్శన శర్మ
కులపతి

# మణిమంజరి

## విషయసూచిక

## గురుదేవులు వి.పి.యస్. గారిచే గుర్తింపబడిన
## తొలి తెలుగు వాగ్గేయకారుల రూపురేఖలు - తాళ్లపాకవారి ఏడు శతక పద్యములు

- వేటూరి ఆనందమూర్తి

These are the two sculpted reliefs of the earliest known Telugu Vaggeyakara-s identified for the first time in 1949, by Gurudev VPS, found on both the outer side walls of the Sankirtana bhandaaram, Tirumala. These images are also seen in the Annamacharya charitra (TTD Publication) shown here.

Again, at the instance of Gurudev VPS, the same images embossed on two copper plates from inside the Sankirtana bhandaram, were retrieved by his devoted research scholar Sri AVS in the same year 1949, when he set foot on a mission to collect more artefacts as explained by himself. The divine inspiration and intervention behind this continued research aspect appear obviously in the fact that the discovery of these two embossed images of the two TP Vaggeyakara-s were retrieved and resurrected only in 1949, that too after a lapse of nearly two decades of evacuating the entire contents of the Sankirtana bhandaram by the authorities and locking it up in the belief that there was nothing more left in it.

When Annamacharya in his old age was referred to as Musali Annamayyangaru in the local records called Kaifiyats, the two succeeding composers of the earliest known Tallapaka Pada Kavitrayam the family, namely Pedda Tirumalacharya and Chinna Tirumalacharya occupied those two prestigious positions of Peddayya and Cinnayya.

This perhaps avoided the need for creating a third image separately for the succeeding composers of the TP family in the Sankirtana bhandaram.

This viewpoint of mine had the approval and endorsement of the greatest authority on Silpashastra Sri S K RamachandraRaogaru also, when we last met a couple of years back along with Sri Anantharam Udupagaru in Bengaluru.

Figure 1: These are the two stone relief images carved on the walls of Sankirtanabhandagaram identified by Gurudev VPS as those of the two vaggeyakaras of the Tallapaka family. The one with the right hand pointing to the Lord as that of Annamacharya and the right handed tambura danDe as Peda Tirumalacharya. This was further explained in detail by him in his introduction to Annamacharya charitra which was followed for some years.

1. శ్రీ యిలమేలుమంగ కుచసీమల నుంచిన కుంకుమాంకసు
శ్రీ యురమందు నేత్రముల జెక్కుల విభ్రమముల్ ఘటింపగా
బాయక శేష శైలమున బాల్పడ నిల్చిన తండ్రి కావవే
ధీయుత వేంకటాచలపతీ! కలశాంబుధికన్యకాపతీ!

2. కంటిని శంఖ చక్రములు, కంటిని మీ పులుకాపు తీర్థ ని
షుంటక వాసనా రుచులు, గంటిని మీ చరణాంబుజాతముల్
తొంటి నిరూఢ పాపముల దూలుచు మీ మధుర ప్రసాదముల్
తింటిని వేంకటాచలపతీ! కలశాంబుధికన్యకాపతీ !

3. నీవు త్రిలోకభర్త వని నేశిల నీటను వేసి దేల్తు, స
త్పావని వీవె కాని మరి దైవము లేదని మద్దు దూతు, స
ర్పావళి బట్టి యంత్రితల మంటుదు జూడుము బంటు శక్తులన్
దేవర వేంకటాచలపతీ ! కలశాంబుధి కన్యకాపతీ !

4. నీ పదభక్తి నా హృదయ నిర్మల పీఠిక నిల్చె నా భవం
బేపు వహించె నా సుకృత మేర్పడె నేడు గదయ్య తండ్రి హృ
త్పాప సముద్ర ముద్దవిడి దాటుట మీ కరుణా కటాక్షపున్
దేపను వేంకటాచలపతీ ! కలశాంబుధి కన్యకాపతీ !

5. నిద్దపుటాస్యరంగమున నిల్పి ప్రబోధపు గాసెగట్టి యే
ప్రొద్దును వెంట దంబురను బూనిచి తాత్త్విక నాట్య శాస్త్రపున్
బుద్ధులు సెప్పి నా హృదయ పుత్రిక మీకును మేలు పాడగా
దిద్దితి వెంకటాచలపతీ ! కలశాంబుధి కన్యకాపతీ !

6. గురుపద సాధనంబు లివిగో భవదంకము లుండు జూడవో
సిరి దళుకొత్తుచున్నయవి శ్రీతులసీ వనమాలికావళుల్
మురిపెపు శంఖచక్రములు ముద్రలు మీ తిరుచూర్ణ రేఖలున్
దిరుమణి వెంకటాచలపతీ ! కలశాంబుధి కన్యకాపతీ !

7. అక్షముదైన నేర కెదురాడిన దుర్జనుడైన తండ్రి సం
రక్షణ లేక బిడ్డడు సురక్షితుడై మనునే జగత్త్రయా
ధ్యక్షుడ వీవు దాసజన దక్ష సురక్షణదక్షిణ క్రమా
దీక్షిత వెంకటాచలపతీ ! కలశాంబుధి కన్యకాపతీ !

**1. ముద్ర - మకుటం**

"కలిత లక్ష్మీశ సర్వజగన్నివేశ విమల రవికోటిసంకాశ వేంకటేశ" ఇది పెదతిరుమలాచార్యులవారి ముద్ర. ఇందు 'కలిత లక్ష్మీశ - వేంకటేశ' అన్న భావనే ముఖ్యము.

ఇంకనూ చూ.

"యింక నేను అలమేలుమంగకు ఈశ్వరుడవైన శ్రీ వేంకటేశా (యనువాఁడ)

యింక నేను ఆచార్య ననుమతి హృదయములోపల దలఁచువాఁడ॥ అలసితిని॥ (15-384; తేకు 67).

**2. ఇప్పుడిటు కలగంటి**

అరుదైన శంఖచక్రాదు లిరుగడ గంటి

కంటి శుక్రవారము గడియ లేడింట (11 - 184).

**3. విశ్వాసాలు : చూ.3-142; 9-205**

నిజము నిరూపించుటకు నాలుకతో ముక్కంటుకొనుట ఈ మోముచూచి నగకుండుట వగైరాలు.

**4. పాపాలపడగ భవపయోధులకు**

తే పై యున్నాడిదె దేవుడు.

**5. ఇన్నాళ్లు నెరుగక ఇందులోనే వోలాడితి...**

జీవుల సంగాతాలు చిమ్మి రేచి యంటుకోగా
భావించి నీ మీ ఉదటి బత్తి కట్టితి
శ్రీ వెంకటేశుడవు నీ దేవు లలమేలుమంగ
నీవు నాకు బుద్ధియ్యగ నిన్నే పాడితిని (11-189. కొత్తసంపుటం 4 - 484)

మీది సంకీర్తనములోని ముద్రనుబట్టి యిది పెద్ద తిరుమలాచార్యుల రచనగా భావింతును. రేకుల కెక్కించేనాడు పాటల కలగలుపు కారణముగా కాబోలును అన్నమాచార్యుల రచనగా రేకులలో కెక్కినట్లున్నది! ఇట్టివి మఱియెన్నో కలవు.

**6. సాళంగనాట**

నీ గురుతులు చూచుకో నీ బిరుదు లెంచుకో
యీ గతిని కలబంటు నిక నన్ను గాచవే ।
కానీలే నే నెంత కఠిన చిత్తుడనైనా
నా నొసల నివే పట్టెనామాలు
మేను తోలు నెమ్ములతో మెరసినదైనాను
పూనితి దమ్మి తులసి పూసల పేరులు ॥

భ్రమసి నే జేసినవి పాపకర్మములైనాను
జమళి భుజాల నివే శంఖచక్రాలు
అమర దఱచుగా నే నాడేవి కల్లలైనా
తమి బాడేనాలిక నీ తగు సంకీర్తనలు ॥

తలచితే నా వోజ తామసగుణ మైనాను
పిలిచేది భువిలో నా పేరు తిమ్మడు
అలర శ్రీవేంకటేశ!అన్నిట నే దుష్టునైనా
తలకొనె నాయందు దాసరితనములు ॥ 4-476 ; ఱేకు 382.

ముద్రనుబట్టి మీది కొత్తసంపుటంలోని, 4-484 కీర్తన వలెనేయీ 476 సంకీర్తనము కూడా పెదతిరుమలాచార్యులదే అనుటలో సందేహము లేదు. అన్నమాచార్యుడు తన పేరును 'తిమ్మడు' గా పేర్కొనడు కదా! ఇట్టివానిని గుర్తించి పాదసూచికలలో చూపుట తగును.

7. తండ్రిగారినీ, కలశాంబుధికన్యకాపతియైన స్వామివారినీ సమంగా తన తండ్రిగాను, గురువుగాను భావించిన దాసుడైన యా 'బిడ్డడు' 'నేరకెదురాడినా' కూడా తప్పక తండ్రి రక్షణలో సురక్షితుడే కదా అనుకొన్నవాడు పెద్ద తిరుమలాచార్యుడే కాదగునని నా భావన !

అజ్ఞాత కర్తృకమూ రమ్యమూ అయిన యీ శతక శకలాన్ని నాన్నగారు సేకరించి తమ 'వెంకటేశ్వర లఘుకృతులు' అనే సంకలనంలో మొదట ప్రకటించారు. అందుకు తెలుగువారు వారికి ఎంతో ఋణపడి ఉన్నారు.

సంకీర్తనలలోనిముద్రలనుబట్టి, 'తిమ్మడు' అనే పేరునుబట్టీ, రేకులలోని కొన్ని కొన్ని సంకీర్తనలు తండ్రీ కొడుకులవనే తేడా తెలియకుండా కలిసిపోయాయని పరిశీలించినవారికి అనిపించక పోదు! 'దినము ద్వాదశి తీర్థ దివసము నీకు', 'నీ గురుతులు చూచుకో' వంటి కీర్తనలే ఇందుకు నిదర్శనములు.

ఇట్టి పరిశీలనలోనే ఇప్పుడీ శతక శకలం పూర్తిగా తాళ్ళపాక పెద్ద తిరుమలాచార్యులదనే గట్టి యెఱుక ఏర్పడింది. ఇక దీని నిప్పుడు పాడించే ప్రయత్నం చేద్దాము.

పైని చూపిన విధంగా యీ శతక శకలంలోని ఏడు పద్యాలూ పెద్ద తిరుమలాచార్యుల రచనగానే భావిస్తున్నాను. ఈ రచన సప్తసంఖ్యకే పరిమితమో, శతాధికమో, పూర్తిగా లభించిననాడుగానీ మనకు తెలియరాదు.

గురుదేవ్ **V P S** నమస్కారం, మాస్టర్ **C V V** నమస్కారం.

– వేటూరి ఆనందమూర్తి

***

# మన యోగము

- సుజాత

యోగ మిత్రుల ఆదేశానుసారం "మణి మంజరి" సంచికకు యోగపరంగా ఏదైనా వ్రాయమని కోరడంతో ప్రారంభించాను గానీ తృప్తిగా వ్రాశాను, అన్న భావన రావడానికి చాలా తంటాలు పడాల్సి వచ్చింది.

కారణం నేటి కాలమాన పరిస్థితులు మానసిక .....ఒత్తిడులు, అనారోగ్యాలు, ఇంటా బైటా అన్నివైపుల నుంచీ రావడంతో ఒక రకమైన నిర్లిప్తత మనస్సుకి ఏర్పడి దేనిమీదా దృష్టిపెట్టలేక పోతున్నాను.

మేము హైదరాబాద్ నుంచి ఢిల్లీ వచ్చి అప్పుడే మూడేళ్ళు కావస్తున్నది. కారణం అమ్మాయి, అల్లుడు, "ఉద్యోగ రీత్యా" రావడంతో కదలక తప్పలేదు. పోనీ ప్రార్థనా సమావేశాలకన్నా హైదరాబాద్ వెళ్ళవచ్చు ననుకుంటే ఈ "కరోనా" సమస్యతో ప్రపంచవ్యాప్తంగా కట్టిపడేసి ఎక్కడి వాళ్ళ నక్కడే "బందీలను" చేసింది ! మొదట్లో ఈ కట్టడి బాగానే వున్నదని, శారీరక, మానసిక, ప్రశాంతత ఏర్పడుతుందని, ఆశించారు. గానీ అదిగూడా అనేక సమస్యలకు కారణభూతమై చికాకులు ఎక్కువ అయినాయి. చేతకాక నేను ఒక్కర్తినే ఇలా బాధ పడుతున్నానా? అంటే ప్రపంచమంతా సర్వేసర్వత్రా ఇలానే ప్రతి విషయంలోను "ఆందోళన కరంగా" మానసిక చింతనలు, అనారోగ్యాలకు దారితీస్తున్నట్టు తోస్తున్నాది. ఈ పరిస్థితుల నుంచి ఎప్పుడు ఎలా బైట పడతారు? ఎలా చక్కదిద్ద బడుతుంది? ఎంతకాలం మంచి రోజులకు ఎదురు చూడాలి? ప్రపంచజనాభా నార్మల్ వాతావరణానికి రావడం అన్నది జరుగుతుందా? అన్నీ ప్రశ్నార్థకాలే !

మాష్టర్ C.V.V గారి నుంచి కొన్ని నియమనిబంధనల ననుసరించి ప్రపంచంలోకి విడుదల చేసిన కొత్త యోగం పేరు "భృక్త రహిత తారక రాజయోగం" ఇది అజ్ఞాతంగా ప్రారంభించబడి ఈనాటికి శాఖోప శాఖలుగా విస్తరించి, అందరి చేత గుర్తింపుకు వచ్చింది. అందులో ఆంధ్రదేశం నుంచి సారధ్యం వహించిన ముఖ్యులు కొందరు ఈ క్రింద పేర్కొన్న వారు మాష్టరు గారి "డైరెక్టు మీడియంస్" గా పేరుపొందారు. వారూ వారి వల్ల ఉపలబ్ది పొందిన శిష్యగణం గురించి చెప్పుకుందాము.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు V.P.S

శ్రీ మైనంపాటి నరసింహంగారు M.N

శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారు E.K

వీళ్ళ ముగ్గురికీ శిష్యపరంపర ఆంధ్రదేశం నుంచి దేశదేశాల దాక విస్తరించివున్నారు. ఇందులో ముఖ్యంగా మా నాన్నగారైన వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని గురించి చెప్పడానికి ప్రయత్నిస్తాను. వారు అనారోగ్యకారణంగా శ్రీ మాష్టరు గారిని ఎలా కలిశారు ? వారు వ్రాసుకున్న "ప్రజ్ఞాప్రభాకరము" అన్న దాంట్లో వివరంగా వ్రాసుకున్నారు. అసలు మాష్టరు గారిని, కలిసిన వాళ్ళలో చాలా మంది అనారోగ్య కారణాల చేత కలిసినవాళ్ళుగా తెలుస్తుంది. దాని తరువాత ఆరోగ్య భాగ్యాన్ని పొంది "యోగపరంగా" అభివృద్ధిని సాధించారు.

నాన్నగారు "మాష్టరు యోగంలో" చేరి దాని అంతరార్థం ఆకళించుకుని, అశిధారావ్రతంగా, త్రికరణ శుద్ధిగా పరార్థలాభాన్ని, క్షేమాన్ని నిత్యప్రార్థనలో రెండు వేళలా తాను ఆచరిస్తూ, చుట్టూ వున్న మిత్రమండలిని "యాగ మిత్రమండలిగా" తీర్చి దిద్దుకుంటూ, అనేకులకు మార్గ దర్శికులైనారు. వారు ఈ మాష్టరు యోగాన్ని ఎలా దర్శించినది వారు వ్రాసుకున్న ఈ పద్యాన్ని గమనించండి.

"నారలు కట్టుచీరల శనంబులు కాయగసుళ్ళు కొండలుం గారడవుల్ నివాసములుగా దపియించి మహర్షు లెవ్వరినో చేరుకొనందలంచిరి అల చిన్మయ తత్వము సర్వమానవోద్ధారముగోరకొన్న అవతారము మద్గురు మూర్తి గొల్చెదన్."

ఆ శిష్యపరంపరలో ముఖ్యంగా చెప్పుకోతగినవారు, ఇప్పటికీ ఆ యోగ స్ఫూర్తితో, అదే వరవడితో వాళ్ళ దగ్గరకు అనారోగ్యకారణంగాను వెళ్ళినా, ఫోన్లమీద మాట్లాడినా, పరిచయాలు పెంచుకున్నా, ఆరోగ్యపరంగాను, యోగపరంగాను అభివృద్ధి చెంది సుఖంగా వున్నవాళ్ళు, కొల్లలుగా ఉన్నారు.

తిరుపతి నుంచి శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారు వారి "ప్రభాకర మిత్రమండలి" ద్వారా ఇప్పటికీ కొన సాగుతున్నవి. ప్రార్థనలు. అలాగే శ్రీ కొత్త రామకోటయ్యగారు శాస్త్రిగారి దర్శకత్వంతో ఆరోగ్యాభివృద్ధికి ప్రార్థనలు సమావేశాలు జరిపించి ఇప్పటికీ వారి ప్రభవెలుగుతూనే వున్నట్లుగా వుంది. విజయవాడ నుంచి శ్రీమతి చాగంటి కల్పవల్లి గారి ఆధ్వర్యంలో ఇలాగే ఆరోగ్య సమావేశాలు సంచలనాలను, గమనించేట్టుగా, నిర్వహించారు.

ఇదే విధంగా ఒంగోలు నుంచీ, పిడుగురాళ్ళ నుంచీ, వరంగల్ నుంచీ యం.ఎన్.గారి యోగా స్కూల్ ద్వారా ఉత్తేజితులై మాష్టరు సి.వి.వి.గారి ఆదేశం పై వారి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

విశాఖపట్నం నుంచి శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారి "గురుకుల విధానంలో" ప్రజలలోకి ఈ యోగ ప్రచారం "సనాతన ధర్మానుసారం వరల్డ్ టాచర్స్ ట్రస్టు" గా ప్రపంచ మంతటా విస్తరించి వెల్లివిరుస్తున్నది. శ్రీ మాష్టరు సి.వి.వి గారి యోగ ప్రభావం, యోగప్రభ, ప్రపంచీకరణచెంది విశ్వవ్యాప్తంగా వెలుగులోకి వచ్చి త్వరితగతిన విస్తరిస్తున్నది.

హైదరాబాద్ లోనూ యోగమిత్రులు చాలా మంది యోగ సాధన చేసుకుంటూ, కొత్తగా వచ్చేవాళ్ళకు మార్గదర్శనం చేస్తూ నడిపిస్తున్న వాళ్ళు ఉన్నారు.

మాష్టరు సి.వి.వి గారు 1910 "మే 29" న తమిళనాడు లోని "కుంభకోణం" అన్నఊరి నుంచి ఓ మంచి ముహూర్తాన ఈ ప్రపంచానికి తాను ప్రారంభించ దలుచుకున్న **యోగాన్ని** అతి నిరాడంబరంగా అనుగ్రహించారు.

అప్పటి నుంచి తన ప్లాను ప్రకారం ఈ సృష్టికి ఆధారభూతమైన ఈ భూమిపై చేతనాచేతనమైన, ఖనిజ, వృక్ష, జంతు, మానవ వర్గాలలో సృష్టిలోకి వచ్చిన వాటిలో, ఏయే లోపాలను కలిగి వున్నవో, వాటిని సవరించుకుంటూ, చక్కదిద్దుతూ, ఈ భూమిపైన జన్మకి వచ్చిన కారణాలను, ఎరుకతో, గుర్తించుకని, వెల్లడిస్తూ, ప్రారంభించారు. ఈ యోగాన్ని మానవజాతికి మృత్యుంజయత్వాన్ని ప్రసాదించి, పరిపూర్ణమైన మానవుడుగా తీర్చి దిద్దడానికి అవతరించిన "ఆది పరబ్రహ్మమని", చావు పుట్టుకలతో, కొట్టుమిట్టాడుతున్న మానవ జాతికి" అమృతత్వం ప్రసాధించే కారణజన్ముడని, "నాడీ గ్రంథాలు వెల్లడించాయి."

పంచభూతాత్మకమైన ఈ మానవులను ఎన్నుకుని, తన ప్రణాళికను ప్రయోగాత్మకంగా పరిశీలించుకుని, ప్రపంచానికి పరిచయం చేశారు మాష్టరు సి.వి.వి గారు. ఈ భృక్తరహిత తారక యోగాన్ని, నూతన యోగం, సత్యయోగం, సైంటిఫిక్ యోగం అని గూడా అన్నారు. ముఖ్యంగా ప్రపంచవ్యాప్తంగా అర్థం చేసుకునేట్టుగా ఈ "యోగసాహిత్యం" ఇంగ్లీషులోనే మనకి తెలుస్తుంది.

మాష్టరు గారు ప్రవేశపెట్టిన ఈ యోగాలైన్ ఏ జాతి, మత, కుల, తెగ, వర్ణ, లింగ భేద ములుగానీ, దేశ ప్రాంతీయ, భాషా భేదములుగానీ లేక "విశ్వమానవులందరకు "బ్రహ్మత్వము" "అమరత్వము" "శాశ్వతత్వము" కలిగించడమే వారి సంకల్పము ! కన్నులు మూసుకుని అంతరాత్మసాక్షిగా, పరిశీలించు కుంటూ, వారిచ్చే "ప్రజ్ఞను" రిసీవ్ చేసుకోగలిగే అర్హత, యోగ్యత అనుగ్రహించమని నిత్యప్రార్థనలో ఒకే మాటగా కోరుకుందాము అంతా.

మాష్టరు సి.వి.వి నమస్కారము.

- సుజాత

సెల్ : 9866361012

* * *

# మా నాన్నగారు

- వినతా రామ్మూర్తి

సి.వీ.వీ కరుణాకటాక్షములు రక్షించున్ సదా తన్మయం
బై వర్ధిల్లెడు భక్తియున్నయెడ నిత్యానంద మారోగ్య మా
హా పుట్టించెడు ప్రజ్ఞ ఈ త్రయము లభ్యంబౌను తార్కాణ నే
నె। వేయేటికిన్? మీరలిందఱును దీనిన్‌జక్క గుర్తింపరో॥

29-05-1953 **కళ్లేపల్లిలో** సుసర్ల దక్షిణామూర్తి, వేటూరి ప్రభాకరశాస్త్రిగార్ల సంగీత సారస్వత ఉత్సవాలు రెండురోజులు చేశారు. **చాలా బాగా జరిగినాయి.** ఈ ఉత్సవాలకి వెళ్ళినవాళ్ళం ప్రభాకరశాస్త్రిగారి కుటుంబ సభ్యులు మా పెద్దన్నయ్య, సుందరమూర్తిగారు, చిన్నన్నయ్య ఆనందమూర్తి గారు, పెద్దవదిన, అమ్మ, నేను, మా బాబాయిలు(చిన్నాన్నలు) ఇద్దరు శంకరశాస్త్రిగారు, చంద్రశేఖర శాస్త్రిగారు, పెద్దక్కయ్య, కూతురు రాజేశ్వరి, బావగారు అంతా(అందరమూ)కలసి పెద్దకళ్లేపల్లి వెళ్ళాము. ఈ ఉత్సవాలకి (కళ్ళేపల్లి లక్ష్మీపురం నుంచి 3 మైళ్ళు) రెండెద్దుల బండిలో పైన టాపు ఆర్చికి లేక వేరు చేసి ఉంటుంది. బండిలోపల గడ్డిపైన జంపకాన, దాని మీద కూర్చుని ప్రయాణం(5మంది కూర్చోవచ్చు) అది ఎండాకాలం. పౌర్ణమి పండువెన్నెల చెట్లు పచ్చని పొలాలు పల్లె వాతావరణము పండువెన్నెల, చల్లని గాలి కన్నులపండుగగా మా అందరినీ ముగ్ధుల్ని చేసింది. ఆ పల్లె వాతావరణంలో ప్రయాణం చేయడం మరపురాని మరువలేని సన్నివేశం.

ఇప్పటి పట్నవాసపు వాతావరణంలో వీటికన్నిటికీ దూరం అయిపోయినాము. ప్రకృతి సౌందర్యానికి మంచి గాలి చెట్ల నుంచి కోసి తెచ్చిన కూరలు, పండ్లు(ఫలములు), మంచిపాలు, పెరుగు, నెయ్యి, చక్కటి భోజనము. అప్పటి వాతావరణం నెమరు వేసుకోవడమే తప్ప అనుభవంలోనికి రావడం లేదు. ఇంత చక్కటి ప్రకృతిలో ప్రయాణం చేస్తూ రాత్రి గం. 8.30ని॥లకు పెద్దకళ్ళేపల్లి చేరుకున్నాము. అక్కడ మా తాత గారు వేటూరి సుందరశాస్త్రిగారు ఉన్న ఇల్లు, వెళ్ళగానే వాకిట్లో ఖాళీస్థలం రెండు అరుగులు ఉంటాయి. లోపలికి వెళితే పెద్ద ఇల్లు. ఆ పుణ్యస్థలంలో పుట్టినవారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. వేటూరి సుందరరామ్మూర్తిగారు, సుసర్ల దక్షిణామూర్తిగారు అందరూ పెద్దవాళ్ళయి (ఉద్యోగావసరాలతో ఆ ఊరు నుంచి వచ్చి సెటిల్ అయినారు. మా పెద్ద మేనత్త మహాలక్ష్మమ్మగారు చివరి వరకు ఆ ఇంట్లో ఉండి పొలం పనులు చూచుకునేవారు. అందరూ పుట్టింది ఆ ఊళ్లోనే. సంగీత-సాహిత్య సారస్వతాలు, నాటకాలకు పుట్టిన ఇల్లు ఆ ఊరు. అప్పటి విషయాలు ఇవి. మా నాన్నగారు చాలా చిన్నవయస్సులో చదువు-సంధ్యలు

పూర్తి చేసుకొని మద్రాసు వచ్చి, కెల్లెట్ హైస్కూల్లో టీచరుగా పనిచేస్తూ, సాహిత్యపరంగా పరిశోధనలు జరుపుతూ, ఆ ఆదాయంతో తమ్ములను దగ్గర పెట్టుకొని చదివిస్తూ తండ్రిగారికి చేదోడుగా ఉండేవారట. నాన్నగారు, ఇప్పటితరంలో అంత చిన్నవయస్సులో బాధ్యతతో కూడిన పనులు జరుగుతున్నాయా? అంటే చెప్పలేము. మా అమ్మగారు కూడా నాన్నగారు చెప్పినట్లు చేసి సహకరించింది. నాన్నగారి తోడబుట్టిన వాళ్ళు నలుగురన్నదమ్ములు, నలుగురు అక్కచెల్లెళ్ళతో వర్ధిల్లారు. మా పెదనాన్నగారి అబ్బాయిని తొట్లోవేసి ఫంక్షను చేస్తున్నారు అంటే మా మేనత్తలు, అన్నయ్యా! నువ్వు లాలిపాట యేదయినా రాసియిస్తే ఆ రోజు పాడతాము అన్నారట. అప్పుడు నాన్నగారు ఈ లాలిపాట రాసి ఇచ్చారట. వాళ్ళు పాడారు.

**జోలపాట**

శ్రీ రమ్యదేహలాలీ మా ముద్దు
చిన్నారి కూన లాలీ
గారాల కూచి లాలీ మాయప్ప
కంజాత నయన లాలీ॥
సకల లోకాధారుడూ మునిమనో
జలజాత సంచారుడూ
కళంక గుణపూర్ణుడా మముబ్రోచు
ఆర్యా మనోహరుడు॥
ఇందీవరేక్షణుండు, నిజ భక్త
బృందారకావనుండు
ఇందిందిరాలకుండూ, మముబ్రోచు
ఇందిరా నాయకుండు॥
శ్రీ వాజ్మనోధినేత నిజభక్త
చింతితాభీష్ట దాతా
దేవేశు డా విధాత నీకు తా
దీర్ఘాయు వొసగు గాక॥

అటువంటి పండిత వంశములో పుట్టిన నాన్నగారి గురించి యేమి రాయాలి? ఎంతని రాయాలి? వారి జీవితం సంప్రదాయ ప్రయోగాలతో కూడిన విచిత్ర సమ్మేళనము. మరువలేనిది. చివరివరకు పరుల కోసమే తమ జీవితాన్ని ధారపోసిన మహనీయులు నాన్నగారేనని చెప్పాలి. ఇటువంటి వారిని పూర్ణపురుషులు అంటే బాగుంటుదేమో!

మా తాతగారైన సుందరశాస్త్రిగారు సంస్కృతాంధ్రములు యందు మంచి ప్రవేశము ఉన్నవారు. జ్యోతిషమునందు, ఆయుర్వేద వైద్యములోనూ అందెవేసిన చేయి. బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆయన అవసానదశలో(పోతారనగా) మా నాన్నగారిని పిలిచి, భీష్మస్తవము చదవమన్నారట. చదవడం పూర్తి అయిన తర్వాత దగ్గరకు పిలిచి నువ్వు వంశోద్ధారకుడివిరా నాయనా! అని దీవించి ఆశీర్వదించి అన్నది అక్షరాలా ఫలించింది నాన్నగారిపట్ల. ఎంతటి అదృష్టమో కదా!

నాన్నగారిది చిన్నప్పటి నుంచి జాలి గుండె. ఎవరైనా బాధపడుతున్నారు, కష్టంలో ఉన్నారు అంటే వారికోసం తపన పడేవాడు. మా నాన్నగారు అన్నపదం మాకే కాకుండా అందరికీ మా నాన్నగారు అని చెప్పే అదృష్టం కల్పించిన నాన్నగారి గురించి ఇదివరకు అందరూ అన్నివిధాల రాసినవే! మళ్ళా నేను రాయదలచిన అవసరం లేదనుకుంటాను. ఆయన భృక్తరహిత తారకరాజయోగములో చేరిన తరువాత తన సుఖాన్ని కూడా లక్ష్యపెట్టకుండా జీవితాన్ని ధారపోసిన సంపూర్ణజీవులు. ఎందరికో జీవితాన్ని పొడిగించి ప్రాణదానం చేసిన నాన్నగారికి పిల్లలుగా పుట్టడం మా అదృష్టమనే చెప్పాలి. అంతే చాలు మాకు. వారి సంతానములో ఇప్పుడు ఉన్నది, మేము ముగ్గురమే. ఆనందమూర్తి, సుజాతమ్మ, వినతమ్మ గురువుల ఆశీస్సులు ఉన్నంతవరకు చెట్టుకి ఆకులు అంటుకునే ఉంటాయి.

ఇక పెదకళ్ళేపల్లి చేరుకున్న తరువాత అక్కడ జరిగిన సంగీత, సాహిత్య ఉత్సవాలలో పాల్గొని యెంతో ఆనందాన్ని సంతోషాన్ని పొందాము. నాగేశ్వరస్వామి గుడి ఎదురుగుండా చెరువు ఎంతో ప్రశాంతతను ఇచ్చింది. ఇంత పెద్ద చెరువును మరెక్కడా నేను చూడలేదనుకుంటాను. సామెత కూడా ఉంది కదా! ఎక్కువగా తినేవారిని చూచి, "ఇది కడుపా? కళ్ళేపల్లి చెరువా?" అంటాం. ఈ రోజు సభకు చాలా మంది పెద్దలు వక్తలు వచ్చి మాట్లాడేరు, గుర్తున్నవి రాస్తాను.

స్వాగతం - యేలేశ్వరపు వెంకట రామావధానులు
అధ్యక్షోపన్యాసం - ఉన్నవ లక్ష్మీనారాయణ గారు
ఉపన్యాసకులు - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు
శ్రీ దివాకర్ల వెంకటావధాని గారు
శ్రీ తిరుమల రామచంద్ర గారు
శ్రీ కొత్త వెంకటేశ్వరరావు గారు
శ్రీ యడవల్లి ఆదినారాయణ గారు

వీరందరూ మాట్లాడిన తరువాత సాయంత్రం గాత్రకచేరి జరిగినది. విస్సా అప్పారావుగారు వచ్చారు. ఆ సభలో ప్రార్థనాగీతం నేను, మా అక్కయ్య కళాతరు రాజేశ్వరి కలసి పాడాము. అది విని అందరూ

మౌను మా తండ్రీ - తప్పిద
మౌను మా తండ్రీ ॥

(6) రాగం - వసంత

సత్యమెరుగము నిత్యమెరుగము
కృత్య మెరుగము వ్యత్యయంబుల
సత్యయంబుల దీరుచుంటిమి
అరయు మె తండ్రీ - మాలో
మెరయ మె తండ్రీ ॥

(7)

క్రమము తెలియదు, తెలుపగల మొన
మెహినరాగం
గారు లేడిటు నట్టుపడుచుం
భ్రమయు చుంటిమి కటిక చీకటి
బాపు మె తండ్రీ - వెలుగు ॥

(8) రాగం - కానడ

అయనింతకు దుర్వివేక
ఛాయలోపడి కొట్టుకొనగ
మాయ పందెర గప్పి తధిపెడ
ద్రోయుమో తండ్రీ - ఇటుదయ
సేయుమో తండ్రీ ॥

(9) మధ్యమావతి

త్రాహి లోకమశేషమీ త
మ్మోహ ను పనయ నిత్య శుభా మా
దేహి పాహి జగద్గురు రో ఇత
యోహి భో స్వామిన్ అభయం
దేహి భో స్వామిన్॥

వీరందరూ మా నాన్నగారి దగ్గరకి అనారోగ్యాలతో వచ్చి, మాష్టర్ సి.వి.వి.గారి భృక్తరహిత తారకరాజయోగ మార్గంలో చేరి సంపూర్ణ ఆరోగ్యవంతులయి ఆరోగ్యలబ్ధిని పొందినవారు శ్రీ కొత్తరామకోటయ్యగారు, శ్రీ శ్రీనివాసాచారిగారు, శ్రీమతి కల్పవల్లిగారు, శ్రీమతి చంద్రకాంతమ్మగారు, వీరు సంపూర్ణ శరణాగతిని పొంది, నమ్మకంతో, విశ్వాసంతో ఈ యోగంలో పైకి వచ్చి వారి ట్రీట్‌మెంట్ ద్వారా అన్ని బాధలు తొలగి సుఖంగా ఉన్నారు. వారి "డివోటీస్" కొన్ని వందలమంది ఉన్నారు. ఇప్పుడు కాలం చేసి వారు లేకపోయినా వారి కీర్తిప్రభ వెలుగుతోంది.

రామకోటయ్యగారు - చినకాకాని

శ్రీమతి కల్పవల్లిగారు - విజయవాడ

శ్రీనివాసాచారిగారు - తిరుపతి

చంద్రకాంతమ్మగారు - గూడూరు

శ్రీ రామకోటయ్యగారు కాలం చేసే ముందు వారి గురువులైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి కుటుంబ సభ్యులందరినీ చూడాలనుకున్నారట. హైదరాబాదులో కాచిగూడలో ఉన్న వైశ్యహాస్టల్‌లో నాన్నగారి జయంతి సందర్భంగా ఫంక్షను పెట్టారు. దానికి రామకోటయ్యగారు వారిలో కొంతనుంగి వచ్చారట. అపుడు విద్యానగర్‌లో ఉన్న మా అన్నయ్య సుందరమూర్తిగారి ఇంటికి ఫోను చేసి ఈ రోజు 10 గం॥ అక్కడికి భోజనానికి వస్తున్నాను, అని చెప్పారట. తరువాత మళ్ళా కొంతసేపటికి ఫోను చేసి నాకు కాస్త వంట్లో బాగాలేదు. భోజనానికి అక్కడికి రాలేను. మీరందరు ఇక్కడికి వచ్చేయండి, అని చెప్పారట. తాతగారు అన్నట్లుగా అందరు అక్కడికి వెళ్ళి అందరినీ కలుసుకొని చూశారట. వేటూరివారి కుటుంబ సభ్యులందరినీ చూసి చాలా సంతోషపడ్డారట. నేను మాత్రం పాండిచ్చేరిలో ఉండడం వల్ల చూడలేకపోయాను. తాతగారిని, కార్యక్రమాలు అన్నీ అయిన తరువాత తిరుగు ప్రయాణంలో రైల్లోనే పరమపదించారు అని విన్నాను. ధన్యజీవులు.

* * *

# ప్రజ్ఞానస్వరూపులు ప్రభాకరులు

**- డాక్టర్ వేటూరి సదానందమూర్తి**

ఆంధ్ర గీర్వాణ సాహితీ సుగంధ సంభృతము, ధవళ యశశ్చంద్రికా విరాజితమగు మహోన్నత వ్యక్తిత్వమునకు స్థితప్రజ్ఞతకు ఆలవాలమైన వారొక ప్రకాశమానము ధగద్ధగితమైన ప్రజ్ఞానవాఙ్మయ శిఖరము. ఉదాత్త గంభీరమై, ప్రకటము, ప్రకృష్టమైన ఆ అపూర్వ యోగ విశిష్ట శిఖరము సత్యసుందరము, శివము, చంద్రశేఖరము, శంకరము.

కళ్లు తెరుచుకొని చరిస్తున్న మానవులకు - కవికుమారులేకాని, భావుకులేకాని, వీరేకాని, వారేకాని, ఎవరేకాని - ఊహావధి క్షమహేలా మధుయానంలో, ప్రజ్ఞానఘన వినువీధీ విహారంలో, విష్ణుపద విమానయానంలో ఏ బిందువునుండి చూసినా ఏడునిలువుల ఎత్తున దర్శనమిస్తుందా ప్రభాకరమైన అనర్ఘ మహత్తర మానవతా కైలాసశిఖరము. ఆర్తత్రాణపరాయణమై అందరికీ అన్నివేళలా అందుబాటున నుండి తృష్ణార్తిశమనమై ఆప్యాయనమై అమృతోపమానమై వెల్లివిరిసే మానససరోవరము. ఎవరన్నా ఆ మహానుభావులు ! వేరెవరు, వారే వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

"ఎడతెరిపిలేని భాషాపరిశ్రమము, గడితేరిన ఉభయభాషా పాండిత్యములు, వడిగల కార్యదీక్షాదక్షత, చెడిపోని తలపులు, ఒడిదుడుకులులేని తేటతెనుగు కవితారచన, కడదాకిన తాత్త్వికదృష్టి" - ఈ విశిష్ట లక్షణములతో పుట్టిన మహారచయితలు ప్రభాకరశాస్త్రిగారు. ద్రావిడము నెరుగుదురు. అచ్చుయంత్రముల మొగమెరుగక మట్టిబ్రుంగిన తాటియాకులను పట్టుకొని కన్నులు చిల్లులు చేసికొనెడి నిరంతర వ్యవసాయము. దానికి సాయము చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో పరిశోధకపదవి. పెక్కు వత్సరములు ప్రభాకరశాస్త్రిగారా పదవిలోనుండి మదరాసు పండితులచే జోహారులు చేయించుకొనుచు పరిశోధనము గావించినారు. ఈ పరిశోధన ఫలితము శృంగార శ్రీనాథాదిగ్రంథద్వారమున తెలుగువారు చూథలాడుచున్నారు " ఇట్లని శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు తమ ఆంధ్ర రచయితలు గ్రంథము ప్రథమభాగమునందు తెలిపినారు. బహుముఖ - తాళపత్ర గ్రంథ, పురావస్తు / తత్త్వ, శిలాశాసన, తామ్రశాసన - భాషాపరిశోధనలో వారు చేసిన పరిశ్రమము ఇంతింతని చెప్పరానిది, వారి సేవ అనన్యసామాన్యమైనది. శృంగార శ్రీనాథము పరిశోధనా గ్రంథమేకాదు. క్రీడాభిరామమునకు పీఠిక, హరవిలాసము, కాశీఖండము గ్రంథములను సరిపరచి వెలువరించుటకు తోడు ప్రబంధరత్నావళి, చాటుపద్యమణిమంజరి ప్రభాకరశాస్త్రిగారు తమ అమూల్యమైన

పరిశోధన పంటలుగా తెలుగువారి కందించినారు. తంజావూరు ఆంధ్రరాజులచరిత్రకు వారు వ్రాసిన తొడిమ బహుశ్రేష్ఠమైనది, గొప్పది. పట్టినది బంగారముగా ఆ బంగారము తెలుగువారిదిగా అనేక బహూకృతులను వారు జాతికందించినారు. తెలుగు మెఱుగులు, మీగడ తరకలు, సింహావలోకనము వంటి ఏనాటి కూర్పులో వానిలోని ఎన్నెన్నో క్రొత్త విషయములు ఈ నాటికి నిత్యనూతనముగా మనకు కానవచ్చును. నేర్చుకొను నేర్పు మనకు లేకపోయెగదా ! ఇట్టి కనువిప్పు కలిగించే గ్రంథములు విరివిగా లభించి విస్తారమైన ప్రచారము పొంది, వాటియందు రుచి పెంపొందినచో తెలుగుభాష ఉనికికే ప్రమాదఘటికలు మ్రోగిస్తున్న ఆధునికులకు, నవయువతకు వారికి మార్గదర్శకులుగా వెనకటితరానికి ముందుతరాలకు, అప్రమత్తులై వారధిగా మెలగి మంచి మలుపు తిప్పవలసిన మనబోటివారి కర్తవ్యము తెలిసివచ్చునని కొండంత ఆశ కలుగుచున్నది. ప్రభాకరశాస్త్రిగారికి దేశికవితలన్న అభిమానము మెండు. వారి చేతలన్నీ బహుజనహితాయ బహుజనసుఖాయ సూత్రమునకు కట్టుబడినవి. పరమేశ్వర ప్రీత్యర్థమే వారు ప్రతికార్యము చేయుదురు. పాండితీప్రకర్ష, భాషాపరిశోధనను ఎన్నుకొన్నవారు కమ్మని కవనము చెప్పుట, రసరమ్యమైన కవితాశిల్పము నల్పుట లోకములో అఱుదు. వారనేక ఖండకావ్యములు, కృతులు రచించి, పెక్కుచక్కని కవితలల్లి, అవధానములు కూడా చేసినారు. ఇంతటి తెలుగు సరస్వతీ ఆరాధకులై, తెలుగుభాషా సేవకంకితమైన ప్రభాకరశాస్త్రిగారికి ఆధ్యాత్మికత ప్రకృతిజన్యము, సహజసిద్ధమై వెన్నంటివుంటూ చిన్ననాటినుండి పగలు రేయీ కూడా విడవదాయె. నేనెవరు అన్న అన్వేషణ జీవనధర్మంగా ఎప్పుడూ అదే ధ్యాస, ధ్యానం. చావు పుట్టుకలను గూర్చిన పరిశోధన. పరిశోధన ఆ తీరుగా ఆత్మధర్మంగా చిన్ననాటనుండే సహజసిద్ధమై మూడుపూవులు ఆరుకాయలై పండింది. వారి మాటలలో

**"ఆశల్ రేపగ నంతరంగపు టరణ్యం బంధకారమ్మునన్**
**దాసోహమ్మని జొచ్చితిన్ వెదక నంతర్యామి నాలోనెదో**
**భాసిల్లెన్ జిరువెల్లు చేరజన దావమ్మయ్యె నా యగ్నిలో**
**నే సోహమ్మై నిల్చితిన్ పిదప నేదీ నా తనం బయ్యెడన్"**

ఇది వారి పసితనమనను కానీ బాగా చిన్నప్పుడు 9, 10 సంవత్సరాల వయస్సులో కలిగిన అనుభవము. పరిశోధనైన ప్రవణమైన వారి జిజ్ఞాసను, అందలి అన్వేషణను, గమనించారా. అదే కుదురుకొని ఆధ్యాత్మికతతో సమ్మిశ్రితమై తెలుగుజాతి అదృష్టం కొద్దీ ఒక మహానుభావ పరిశోధక శిఖామణి వారి నడుమ నడయాడటం జరిగింది.

నిశితమైన పరిశీలన లోతైన పరిశోధన. ఇదే రీతిగా ధర్మకర్మదీక్ష, సదాచారవ్యవహారాల పాలన, సంప్రదాయ పరిపాలన, దైవచింతన, ధ్యానము, గంధాక్షతధారణగా సాగుతూ వచ్చిన వారు తనను గురించిన

ఎఱుక వృద్ధి చెందగా చెందగా కుంభకోణంలో మాస్టర్ సివివిగారిని తమ గురువుగా గుర్తించి, స్వీకరించుకొని, వారు బోధించిన భృక్తరహితతారకరాజయోగమార్గ మవలంబించి వారియందు అచంచలమైన విశ్వాసంతో తాము ఒక సంస్కర్తగా ఎదిగి ఆధ్యాత్మిక సుగతి, రాజయోగమార్గ పరిణతి సాధించి దరిజేరిన మిత్రసచ్ఛాత్రులకు, లోకక్షేమం కోరి అడిగినవారికి కాదనకుండా యోగమార్గాన ప్రగతి, స్వస్థత వితరణ చేసి ఎందరినో మోక్షగాములనుగా తీర్చిదిద్దినారు. యోగనిష్ఠాగరిష్ఠులైన ప్రభాకరశాస్త్రిగారు మహదాశయులు. "పరమాణువునకు లోపలదాగియుండు సూక్ష్మాత్మ దయసేయవే సూక్ష్మదర్శనంబు" "ఆకుజిల్కలు రెక్క లల్లార్చి యాడుచో పువ్వుల్ గుబాళించి నవ్వుచోట" వంటి వారి రచనలు పారమార్థికతకు, భావుకతకు అద్దముపట్టును. ఏది చేపట్టినను దాని పారమ్యమును నిర్వచింపక వారు దానిని విడువలేదు. ఆ నిర్వచనము అనేక శిష్యప్రశిష్యులకు, అశేష కవి, పండిత, పరిశోధకులకు దారిదివ్వెయై, కరదీపికగా ఆదుకొనకనూపోలేదు. వారు శతాధిక గ్రంథకర్తలు కాకపోవచ్చును. వ్రాసినవి, రాశిపోసినవి అగణితములై అవన్నీ ఒక్కొకటి అపురూపములై శతసహస్ర గ్రంథములకు మూలధనములుగా విలసిల్లే జ్ఞానవిజ్ఞానభాండారములు. అంతటి అపూర్వమైన విజ్ఞానఖనులను భావితరాలకు కానుక చేసిన వారి శ్రమము, పరిశ్రమము వెలకట్టవీలుకాని తపోధనము. వేదములకు, ఉపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు విద్యారణ్యుల భాష్యము నాటికి, నేటికి ఎట్టి పరమ ప్రమాణమో ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనలు, పరిష్కరణలు, వివిధ వ్యాఖ్యలు, పీఠికలు అట్టి ప్రమాణములు. తెలుగునాట భాషా సాహితీ పరిశోధకులకు, విద్వత్కవులందరికీ ఇవి నిత్యము సత్యమైన నిధి నిధానములు.

యోగమార్గములలో సహజయోగము, అనగా, గార్హస్థ్యములో, యోగియై మెలగుట అత్యంత కఠినమైనది. గార్హస్థ్యాశ్రమము తదితర **ఆశ్రమ వ్యవస్థల ఉనికికి, అవి** చక్కగా కొనసాగుటకు ఎంతేని అవసరము. అందుండి నిర్మల నిరహంకార**ములతో, తదితర ఆశ్రమవ్యవస్థ**లను ఆదరిస్తూ అన్ని ధర్మములను నిర్వర్తిస్తూ ద్వంద్వాతీతముగా తామరాకు**పై నీటిబొట్టువలె జీవనము** చేయుట అసాధారణ విశేషము. ప్రభాకరశాస్త్రిగారు అది ఏ ఆడంబరము, **పటాటో**పము లేకయే సహజముగా చేసినారు. "ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ"న్న ఆదర్శము రూపుదిద్దుకొన్న సుందర ఆనంద గురుమూర్తి ప్రభాకరశాస్త్రిగారు. విశ్వమానవప్రేమ, జీవకారుణ్యము, నిత్యానిత్య**ములు,** ఆత్మానాత్మవిచారణ సత్యదయోపకారములు, శాంతి అహింసల పాలన, యోగమార్గాధిరూఢమైన **సాత్త్వికజీవనము** అన్నీ ఏకమైన చరితార్థులు ప్రభాకరశాస్త్రిగారు.

వారి ఒడిలో నన్ను చేర్చుకొని లాలించి ఆడించిన మా పెదనాన్న గారిని ఈ తీరుగా స్మరించటం నాకు ఎంతో సంతోషం కలిగిస్తున్నది. వారు నేను జన్మించిన కొన్నినాళ్లలో వచ్చి నన్ను పడుకో పెట్టిన మంచంమీదనే తానూ కూర్చొని నన్ను ఆడిస్తుండగా మా అమ్మ, వారిని, వాడికి పేరు పెట్టమని అని

అడిగితే నేను వచ్చినప్పటినుండి వీడు నన్ను చూసి నవ్వుతున్నాడు, వీడు సదానందుడమ్మా అన్నారట. అదేకదా నా పేరు. వారిని నీళ్లగాబు దగ్గర సోదరులము మేమిరువురము వీపురుద్ది స్నానం చేయించిన గుర్తు, అందుకు వారు సంతోషపడటం 1948 నాటిమధురస్మృతి. ఇంటికి వారు వచ్చినప్పుడు వైద్యులైన మా తండ్రిగారు డాక్టర్ చంద్రశేఖరశాస్త్రిగారిని ముందు క్లినిక్ లో చూసి మాట్లాడి లోపల గదిలోకి వచ్చి "ఏమమ్మా, మరదలా ఎట్లా ఉన్నావమ్మా" అంటూ పలకరించిన ఆప్యాయతను కళ్లారా చూసి చెవులార విన్న నాకు తలుచుకొంటే ఒళ్లు పులకరిస్తుంది. అందరినీ ప్రేమించేవారు కొందరు ఇంటివారిని విస్మరించటం చూస్తూంటాము. వారికి వారి తల్లిదండ్రుల ఎడను, కుటుంబము ఎడల, వారి తోడబుట్టినవారందరి ఎడల, ఉమ్మడికుటుంబము ఎడల ప్రేమాదరములు, వారి యోగక్షేమములయందు శ్రద్ధ. అందుకు తగినట్లు కుటుంబములోని వారందరకూ వారియెడ చనువుతో కూడిన గౌరవము నాకు బాగా తెలిసిన సంగతులు. ప్రభాకరశాస్త్రిగారి మహనీయమైన భాషాపరిశోధన విషయికమైన పరిశ్రమము, సేవ, యోగవిషయికమైన "ప్రజ్ఞానం బ్రహ్మ" తాదాత్మ్యము, మానవతావాదిగా తరచిన లోతులూ, తాకిన అంచులూ, కవిగా వెలార్చిన భావుకత వారి బహుముఖమైన ప్రజ్ఞకు నిలువుటద్దములు.

మూలాధారమునుండి సాగిన సుగతియానము
ద్వంద్వాతీతమై, త్రిపుటిని భేదించుకొని,
ఇడ పింగళ సుషుమ్నల సహవాసముతో

స్వాధిష్టాన, మణిపూరక, అనాహత, విశుద్ధచక్రములు మహిమోపేతమైన అనుభవములు సిద్ధింపజేయగా గమ్యమైన ఆజ్ఞాచక్రమునకు జయప్రదమైన ప్రస్థానము సంపన్నము కావటమే ప్రభాకరశాస్త్రిగారి ప్రజ్ఞాన ధనం. ప్రజ్ఞానధనులైనవారికి లౌకికమైన ధన కనక వస్తు వాహనములు తృణప్రాయములు. ప్రజ్ఞానస్వరూపులు ప్రభాకరులు. ఆ జ్ఞాన చక్రము చేరుకొన్నవారు ఆత్మజ్ఞానులై సహస్రార సహస్రదళపద్మస్థితులై ఆపై ఎల్లెడలా వ్యాపించి నిత్యమై నిఖిలమై ఆత్మైక్యము చెంది అలౌకిక స్వస్వరూపానందమునంది విశ్వాత్మస్వరూపులై వెలిగెదరు. పెదనాన్నగారు ప్రభాకరశాస్త్రిగారి స్మృతికిదే ప్రేమపూర్వకమైన భక్త్యంజలి.

– డాక్టర్ వేటూరి సదానందమూర్తి
F 21 కోణార్క్‌స్ప్లెండర్ వడగామ్ షేరి
పూనా 411014, 91 98 232 02574

# ప్రభాకరుల తానవమెరుగని మానవం

**- డా॥ తిరుమల రామచంద్ర**

ఆహా! ఈ కనకసూత్రం ఎంతపుణ్యం చేసుకుందో! ఆ పుణ్యవతి శరీరాన్ని కలంకరించింది. ఔను! శ్యామ శబలవ్రతం చేసింది. గనుక ఆ పుణ్యం అనుభవిస్తున్నది. అని ఒక వర్ణన ఉంది. హాలుని గాథాసప్తశతిలో

అనుహవఇ కణఅడోరో
హుఅవహ వరుణాణఁ మహప్పం - 3.11

బంగారాన్ని నగ చేయడానికి కాచి నీటిలో వేస్తారు. తర్వాత సుత్తితో కొట్టి సాగదీస్తారు. ఇలా పెక్కుసార్లు జరిగిన తర్వాత అందమైన నగ రూపు దాలుస్తుంది. ఈ పద్ధతిని హుతవహ వరుణమాహాత్మ్యమన్నాడు గాథా కవి. శ్యామ శబల ప్రశమన్నారు ధర్మశాస్త్రజ్ఞులు.

మనస్సు పరిశుద్ధమై పక్వం కావడానికి ఈ శ్యామ శబలవ్రతం అవసరం. పశ్చాత్తాపమనే నిప్పులో కాలి, దయ అనే నీటిలో మునిగినప్పుడే మనస్సు పరిపాకం పొందుతుంది. మానవత్వం వికసిస్తుంది.

అట్టి హుతవహ వరుణవ్రతం - శ్యామ శబలవ్రతం చేసిన మహనీయులు ప్రభాకరులు. అనుదినమూ వారు ఈ వ్రతం చేసేవారు, అనుక్షణమన్నా అతిశయోక్తికాదు. సామాన్యమానవుడు ఆహారనిద్రాభయాది విశ్రాంతుడు. అతనికి మనస్సుతో, తద్వికాస పరిపాకఫలాలతో అవసరం లేదు. అసాధారణ మానవుడు జీవితంలో ఎప్పటికప్పుడు జరిగే చిన్న సంఘటనల ఫలితాన్ని పరిశీలించి, విశ్లేషించి, జీవితానికి అన్వయించుకొని, మనస్సును పశ్చాత్తాపాగ్నిలో కాల్చి దయాజలరాశిలో ముంచి వివేకాయోఘనంతో బాది పరిపాకం పొంది పరమార్థం సాధిస్తాడు. ప్రభాకరులతో నాకు ఉండిన పరిమిత పరిచయంలోనే ఇలాంటి సంఘటనలు ఎన్నో! వాటిని వారు విశ్లేషించి తమ నడవడికి అన్వయించుకుంటూ ముందడుగు వేసేవారు గాని, ఆ విశ్లేషణ, అన్వయం ఎలా జరిగేవో నాకు నేటికీ అర్థం కాదు. ఒక సంఘటన జరగుతుంది. దానికి జీవితంతో ఏమి సంబంధం? సామాన్య మానవునికి అర్థంకావు. నిత్య సత్య దృష్టి, చరిత్ర పుష్టిగల మహితాత్ములకు - అవి తమను వెలువరించవు. అవి లేనప్పుడు జనం గడ్డరికా న్యాయంగా పోతూ ఉంటుంది. విచారమా? వివేకమా? ఆనాటి సంగతులు నేడు మనసులో మెరసి వినమ్రుని చేస్తాయి.

చిన్న సంఘటనలు ఎంత పరమార్థ ప్రతిపాదకాలో ప్రభాకరులు వివరిస్తేగాని తెలిసేవి కావు. నేను మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో వారికి అసిస్టెంటుగా పని చేస్తున్నాను. 1936లో

ఆ పుస్తకభాండాగారం మ్యూజియం వెనుకభాగంలో పూర్వపు పాశ్చాత్యుల బాల్ డ్యాన్సుహాలులో ఉండేది. వారు అప్పుడు తిరువల్లిక్కేణిలో ఉండేవారు. సాయంకాలం ఆఫీసు పని కాగానే మ్యూజియం మెయిన్ గేట్ వరకు గాని, వెనుక గేటు వరకుగాని అందరూ కలిసి నడిచి వెళ్లి అక్కడి నుంచి ఎవరిదారిని వారు వెళ్లేవారు. ప్రభాకరులు రిక్షాలో తిరువల్లిక్కేణికి వెళ్లేవారు. ఇది అనుదిన చర్య. ఒకనాడు మేమందరం కలిసి గేటువైపు నడుస్తున్నాము. లోకో భిన్న రుచిః - - కదా! ఏదో చర్చ ప్రారంభమై ఒక వ్యక్తి దూషణలో పర్యవసించింది. ప్రభాకరులు వారిస్తూనే ఉన్నారు. కాని ఆ దూషణ ఆగలేదు. ఇంతలో ప్రభాకరులు చిన్నరాయిని ఎడువుకున్నారు. బొటనవేలు గాయమై రక్తం చిందింది. నేను, మరిద్దరు ఆగిపోయాము వారితోపాటు. ప్రభాకరులు ఒక్క నిమిషం కళ్లు మూసుకున్నారు బాధకు. నేను రక్తం ఒక కాగితంతో తుడిచివేశాను. ముందుకు సాగుతున్నాము.

వీరభద్రాచార్లూ, ఏమిటోయ్ దీని సిగ్నిఫికెన్స్? - అని అడిగారు ప్రభాకరులు నావైపు తిరిగి. ఏముంది సార్? మ్యూజియంలోపల కూడ వెధవదారి. కంకర తేలింది. కాలికి తగిలింది, యాదృచ్ఛికంగా జరిగిన ఘటన. దానిని సిగ్నిఫికెన్స్ ఏముంటుంది సార్? - అన్నాను. నా సహజ ధోరణిలో, ప్రభాకరులు కొంచెం ఆగి నావైపు చూచారు. పురాణకావ్య ప్రబంధాలలో తను ఇష్టదేవతల చూపును భక్తులు, తమ ఇష్ట వ్యక్తుల చూపును ఇతరులు చాలా చాలా వర్ణించారు. నండూరి బావ 'కళ్లెత్తితేసాలు కనకాభి సేకాలు' అన్నాడు ఎంకి చూపును. ప్రభాకరుల చూపు దయా తరంగితమైన చూపు. ఎదుటివాని పొరపాటును పట్టి యిచ్చే చూపు. ఎదుటివానిని లోతులకు వెళ్లి ఆలోచింపజేసే చూపు. ఇది తెలుసుకోలేక పోయామే అని నిర్వేదపరచే చూపు. దీనిలో ఇంత అర్థం ఉందా అని ఆశ్చర్య పరచే చూపు. బుద్ధుని చూపు ఇలాటిదే నట!

ఇది యాదృచ్ఛికం కాదు. ప్రపంచంలో ప్రతిదీ సూత్రబద్ధం. శివుని ఆజ్ఞలేంది చీమైనా కుట్టదని కదా సామెత. "తేన వినా తృణమపి న చలతి" అంటున్నది వేదం. ఇంతవరకు మనం ఏమి చేశాము? ఎవరినో పరోక్షంగా ఆడిపోసుకున్నాము.

దానిలో నేనూ ఒక విధంగా భాగస్వామి అయ్యాను. ఇకమీద అలా ప్రవర్తించకు సుమా అని భగవంతుడు నన్ను ఈ విధంగా శాసించాడు. ఆ సహస్రాక్షుడు ఎప్పటికప్పుడు మన చర్యలన్నిటినీ వెలుపలినుంచి చూస్తాడు. ఆత్మసాక్షిగా లోపలినుంచి చూస్తాడు. కనుక మనం ఎప్పుడూ కోర్టులో బోనులో ఉన్నట్టుగానే భావిస్తూ, మన తప్పులను దిద్దుకుంటూ ఉండాలి. ఇదే ఆత్మవివేచన - అన్నారు ప్రభాకరులు.

నేను ఎన్నో తప్పులు చేస్తూనే వున్నాను, వాటికి యథానురూపంగా శిక్ష అనుభవిస్తూనే వున్నాను. అయినా, ఏ తప్పుకు ఏది శిక్ష, ఎందుకు తప్పులు చేస్తున్నాను, తప్పులు ఆపలేనా అని నా మృత్పిండ బుద్ధికి ఎప్పుడూ తట్టలేదు.

డాక్టర్ వీరమణి విశాఖపట్నంలోని ఒక కళాశాలలో ఆర్థిక శాస్త్రా చార్యుడుగా ఉండేవాడు. తర్వాత అన్నామలై విశ్వవిద్యాలయానికి వచ్చాడు రైట్ అనరబుల్ శ్రీనివాసశాస్త్రిగారి కాలంలో. ఆయనకు చాల దగ్గరివాడు. ఆయన భయంకరమైన ఉబ్బసంతో బాధపడేవాడు. ప్రభాకరుల వద్దకు చికిత్సకై వచ్చాడు. సత్ప్రవర్తన, సుందరాకారం కలవాడు. ఒక సాయంకాలం ప్రార్థనా సమయంలో ఆయనకు ఉబ్బసం మితిమీరి పోయింది. రొమ్ము, పక్కనే వున్న సముద్రతరంగాలలాగ ఎగిరెగిరి పడుతూంది. ఆయన భార్య నవ యువతి, దిగాలుపడి చూస్తూంది. తక్కిన ప్రార్థయితలందరూ దీనవదనంతో చూస్తున్నారు. ఇలా గంటసేపు ఉంది విషమపరిస్థితి.

నేను ఆ స్థితికి తట్టుకోలేకపోయాను. ఒళ్ళు తెలియలేదు. ఏమిటి సార్ ఇది? నా మిత్రుడు వీరమణి చావుబదుకులలో ఉన్నాడు. మీరేమో కళ్ళు మూసుకుంటూ తెరుస్తూ పెదవులు కదలిస్తున్నారు. చేతకాదనయినా చెప్పండి, ఏ ఆస్పత్రికయినా పంపండి. ఆయనకు ఏమయినా అయితే ఎవరు బాధ్యులు? అని గావుకేక వేశాను. నేనెంత? నా తాహతు ఎంత? కేవలం అవివేక పరాకాష్ఠ. ఇక్కడ ఉన్నవాళ్ళంతా వీడేమిటి, ఆర్చేవాడా తీర్చేవాడా, అవివేకంతో ఆగడం చేస్తున్నాడు, శాస్త్రిగారికి లేని బాధ్యత వీడికా? అధిక ప్రసంగి – అనే భావంతో చూచారు. ప్రభాకరుల తెల్లటి చూపులలో ఎర్రటి జీర కనిపించింది. ఆగు అన్నట్లుగా చేయి చూపారు. నేను ఆగలేదు. అందరూ బాధ్యతా రహితు లైనట్లు, నేను సకల బాధ్యతలూ వహించినట్లు మాట్లాడుతూనే ఉన్నాను. ప్రభాకరులు గట్టిగా 'ఆపవోయ్' – అన్నారు. అక్కడున్న వాళ్ళను చూచి 'ఈయన మనకు భగవంతుడు ప్రసాదించిన అంకుశమండీ' – అంటూ ధ్యాన నిమీలిత నేత్రులయ్యారు. అరగంటకు వీరమణి పరిస్థితి మెరుగయింది. వీరమణి వెళ్ళిపోయాడు. నేనూ వెళ్ళబోయాను. కూర్చోమన్నారు ప్రభాకరులు. కూర్చున్నాను.

విను. నీకు కోపంరావడం సహజమే. వీరమణి దుస్థితికి ఎవరికైనా కష్టం కలుగుతుంది. నీ కోపతాపాలలో నిజం ఉంది. నీ ప్రవర్తనకు నాకూ కోపం వచ్చింది సుమా! నీవన్నట్టు ఎందుకు నాకీ బాధ్యత? నా సమర్థత ఎంత? తప్పుగాదూ! కనుక నీ మీదా నామీదా కోపం వచ్చింది. నా మీద కోపం వచ్చిందంటే నా అసమర్థతమీద ననుకుందాం. నీ మీద కోపం ఎందుకు రావాలి? వీరమణి బాధపడుతున్నాడు. అందరిలాగే నీవూ కనికరించావు. నేనేమీ చేయలేక పోతున్నానని కోపగించుకొన్నావు. దానిని గ్రహించకపోగా కోపమెందుకు నాకు? – అన్నారు ప్రభాకరులు.

నాకు కనువిప్పయింది. నా బాధ్యతారహితమూ, అసభ్యమూ అయిన ప్రవర్తనకు సిగ్గుపడ్డాను. క్షమాపణ కోరుకున్నాను అందరినీ. వారు క్షమించామన్నట్లుగా మందహాసం చేశారు. ప్రభాకరులు అందుకున్నారు. వద్దు. నీవు క్షమాపణ కోరవద్దు. నిజానికి క్షమాపణ కోరవలసినవాడిని నేను. చెన్నపట్నం

లోని ఘన వైద్యులంతా వదలి పెట్టిన వీరమణిని తగుదునమ్మా అని నా నెత్తిమీద ఎందుకు వేసుకోవాలి? వీరందరినీ నాతోపాటు ప్రార్థన చేయమని ఎందుకు బాధించాలి? నీబోటివాడి మనస్సు ఎందుకు కష్టపెట్టాలి? అంటూ పశ్చాత్తాపం ప్రకటించారు. ఆ పశ్చాత్తాపాగ్నిలోనే అళవందార్ స్తోత్రంలోని వారికి ఇష్టమైన శ్లోకాలు పఠించారు.

**ఆ అవివేక ఘనాంధ దిఙ్ముఖే**
**బహుధా సంతత దుఃఖ వర్షిణీ,**
**భగవన్ భవదుర్దినే పథ**
**స్థలితం మామవలోకయాచ్యుత!**

(ఓ భగవన్! అచ్యుతా! ఈ సంసారమనేది దుర్దినం. అవివేకమనే దట్టమైన మొగిళ్లు కప్పుకొని దిక్కుతెలియడం లేదు. దుఃఖమనే వర్షం ఎడతెరపి లేకుండా కురుస్తుంది. దారి తప్పాను. నన్ను చూడు, కాపాడు, దారి చూపు.)

**అపరాధ సహస్ర భాజనమ్**
**పతితం భీమ భవార్ణవోదరే,**
**అగతిం శరణాగతం హరే**
**కృపయా కేవలమాత్మసాత్కురు.**

(ఓ తండ్రీ! హరీ! నా తప్పులు వేనవేలు. భయంకరమైన భవసముద్రంలో పడ్డాను. మరొక గతిలేక నిన్నే శరణుపొందాను కేవలం దయతో నీవాణ్ని చేసుకో. నీ దయ తప్ప నాకు ఎలాంటి అర్హతా లేదు.)

**అమర్యాదః క్షుద్రశ్చలమతిరసూయాప్రసవభూః**
**కృతఘ్నో దుర్మానీ వినయరహితో వంచనపరః,**
**నృశంసః పాపిష్ఠః కథమహమితో దుఃఖజలధేః**
**అపారా దుత్తీర్ణః తవ పరిచరేయం చరణయోః.**

(నేను నా పరిమితులను ఏమీ ఎరుగనివాడిని. అల్పుణ్ణి. చంచలబుద్ధిని. అసూయకు పుట్టినిల్లు వంటివాడిని. చేసిన మేలును స్మరించనివాణ్ని. దురహం కారిని. వినయవిధేయతలు లేనివాడిని. మోసగాడిని. క్రూరుణ్ని. పాపాత్ముణ్ణి. ఇలాంటి వాడిని ఈ అపారమైన దుఃఖసముద్రం దాటి నీ చరణ సేవను ఎలా చేయగలను? ఈ దోషాలున్నవాడు ఈ దుఃఖసముద్రం దాటలేడు. దానిని దాటడానికి ఆ దోషాలు పోవాలి. ఎలా?)

సార్! అది వైష్ణవ ప్రపత్తి విషయం. నైచ్యానుసంధానం. అంత దుర్మార్గుడు ప్రపంచంలో ఉంటాడని అనుకోను - అన్నాను. వారు నావాదం ఒప్పుకోలేదు. ఏ మనకు తెలీకుండానే ఎన్నో తప్పులు చేస్తాం. కనుక ఆ పశ్చాత్తాపం అవసరమే. ఏ మనం అజ్ఞాతంగా ఎందరిని నొప్పించామో, నొప్పిస్తున్నామో మన మాటలతో, చర్యలతో! కనుక యమునాచార్యుని ఆవేదనను నేను గ్రహించగలను అన్నారు. హృదయాన్ని విప్పిచూపే ఈ స్తోత్రం వారికి చాల ఇష్టం. నిత్యత్వాన్ని గురించి వారూ ఆలోచించారని, ఇతర వేదాంతులవలె కాక దేహం భగవత్కైంకర్యం కోసమని నమ్మి దాని అవసరం గుర్తించినవారు వైష్ణవులని, దేహం అపదార్థమంటూ, ఎక్కడో ఏదో వుందని పాకులాడడం దేవతావస్త్రాలను మూరవేసిన మోసగాళ్ళ చర్యవంటిదని ప్రభాకరులు వివరించారు. పశ్చాత్తాపంతో వారి మనస్సు కుతకుతలాడడం నాకు కనిపించినట్లయింది.

గాంధీజీ కి ఎదురుతిరిగిన సుభాషచంద్రబోసంటే ప్రభాకరులకు పడదు. బోసు హింసావాది. అతని విధానం మనదేశానికి సరైందికాదు - అనేవారు. బోస్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికకాగానే భారత పర్యటన చేస్తూ మద్రాసుకు వచ్చారు. ఆయన గొప్పవక్త. ఎంతో ప్రతిఘటన ఉన్నా, గాంధీజీ సమర్థించిన డాక్టర్ పట్టాభి సీతారామయ్యను ఓడించి 1938లో ఎన్నికయిన వారు. జనం తండోపతండాలుగా ఆయన ప్రసంగం వినటానికి బీచికి వెళుతున్నారు. నేనూ వెళ్ళాను. నావెంట ప్రభాకరుల కనిష్ఠపుత్రుడు ఆనంద్ (ఇప్పుడు డాక్టర్ ఆనందమూర్తి, తెలుగుశాఖ ప్రొఫెసర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం), కుమార్తెలు సుజాత, వినత వచ్చారు. వారు నావెంట సుభాష్ బోసు చూడరావడం ప్రభాకరులకు తెలీదు. వారు ఆ రాత్రి ఆంధ్ర విశ్వవిద్యాలయ పరీక్షకుల సమావేశంలో పాల్గొనడానికి విశాఖపట్నం వెళ్ళవలసి వుంది. బండి ఎనిమిది గంటలకు కాబోలు! పిల్లలకు కూడా చెప్పి వెళదామనుకున్నారు. పిల్లలు కనిపించలేదు. బండికి వేళవుతూంది. పిల్లలు ఏరీ? నేను పిల్లలు ముగ్గురిని వెంటబెట్టుకుని సుభాష్ చంద్రుని చూడబోయానని తెలిసింది. అగ్గయిపోయారు. విశాఖ ప్రయాణం మానుకున్నారు. మాకోసం ఎదురు చూస్తున్నారు. లక్షలజనం! మద్రాసుజనం, ఇరుగుపొరుగుజనం మొత్తం పదిహేను లక్షలజనం వచ్చినట్టు అంచనా. ఆ గుంపును తోసుకొని ఇంటికి రావడానికి రెండు గంటలు పట్టింది. వారి ఇల్లు బీచికి అర్థఫర్లాంగులో వుంది. కాని జనంనుంచి విడిపోయి రావడానికి అంత ఆలస్యమయింది.

ఇంట్లో అడుగుపెట్టాను. ఇల్లు చాల పెద్దది. ముందుగేటు. లోపలి బయలు. దారికి ఇరుపక్కల తోట. తర్వాత పెద్దవసారా. రెండు వరుసలలో దాదాపు ముప్ఫైమంది కూర్చుని ప్రార్థన చేసుకోవచ్చు. వారు వసారాలో పాదచ్చాయలు వేస్తున్నారు కోపంతో. నేను గేటు తెరిచాను. పిల్లలు భయం భయంతో పిల్లుల్లాగ లోపలికి వెళ్ళిపోయారు. అప్పటికే చాల పొద్దుపోయింది గనుక, అంతగుంపులో బస్సులు దొరకడం కష్టంగనుక కాలినడకన ఎగ్మూరుకు వెళ్ళదలచి వెనుదిరిగాను.

ఆగు! – అన్నారు ప్రభాకరులు ఆగాను. దగ్గరికి వచ్చారు. ఆ రాక విసురు చూడగా కొడతారేమో ననిపించింది. అంతటి రౌద్రాకారంతోను అన్నారు – నాకు బోసంటే గిట్టదని తెలుసుగదా! అతన్ని చూడవద్దన్నాను గదా, గాంధీజీని ధిక్కరించిన మనిషిని ఏమొగంపెట్టుకొని చూచావ్? నీ ఇష్టం. ఏమైనా అఘోరించు. నన్నడగకుండా నా పిల్లలను ఏమని తీసుకెళ్ళావ్? తా చెడ్డకోతి వనమెల్ల చెరిచిందట! ఏం? మాట్లాడవేమ్?

ఈ ధోరణిలో అరగంట సేపు సాగాయి వషట్కారాలు. నేను గేటును ఆనుకుని నిలబడ్డాను. వారు మీదిమీదికి వస్తున్నారు. నోరు మెదపబోయాను. కాని, ప్రభాకరుల సతీమణి మహాలక్ష్మమ్మగారు వెనుకనుంచి సైగచేశారు నోరు కదపవద్దని. నిజానికి ఆమె తీసుకొని వెళ్ళమంటేనే పిల్లలను తీసుకొని వెళ్ళాను. ఆమె ప్రభాకరుల ప్రచండరూపం చూచి ఆ సంగతి చెప్పడానికి జంకి ఉంటారు. ఇంతకోపం వస్తుందని, విశాఖప్రయాణం మానుకుంటారని ఆమె ఊహించి ఉండరు. ప్రభాకరులు కొంచెం శాంతించి వసారాలోకి వెళ్ళారు. ఇదే సందని నేను గేటుకు ఇవతలపడ్డాను.

ఆ రాత్రంతా కునుకైనా లేదు. నిజమే. వారికి తెలుపకుండా పిల్లలను పిలుచుకొనిపోవడం తప్పే. కాని, నేను స్వతంత్రించి పిలుచుకొనిపోయానా? వారి సతీమణి చెబితేనే గదా పిలుచుకొని వెళ్ళాను. ఆమె వారి అనుమతి తీసుకొని ఉండరు. తర్వాత చెబుదాంలే అని అనుకున్నారేమో! అయినా, సుభాష్ చంద్రుడు హింసావాది ఎలా అవుతాడు? కాంగ్రెస్ అధ్యక్షుడుగదా! కాంగ్రెస్ విధానం అహింస కదా! తద్విరుద్ధంగా అతడు ప్రవర్తిస్తాడా? కాంగ్రెస్ సభ్యుల మెజారిటీతోనే గదా ఎన్నికయ్యాడు. అతన్ని ఎన్నుకున్న వాళ్ళంతా హింసావాదులేనా? – ఇలా ఆలోచనలతో ఎప్పుడో నిద్రపట్టింది.

మర్నాడు ఉదయం భారతి సంపాదకులు గన్నవరపు సుబ్బరామయ్య గారి ఇంటికి వెళ్ళాను ధర్మసందేహం తీర్చుకొనడానికి. మేడమీది వాటా. చర్చ జోరుగా సాగుతూంది. ఆయన సంతానంలోను కొందరు బోసుపక్షం, మరి కొందరు గాంధీజీ పక్షం. దాదాపు పదకొండు గంటలు. సుబ్బరామయ్య గారు ఇంటితలుపు ఎదుట కొద్దిదూరంలో ఉన్నారు. నేను తలుపువైపు వీపుచేసి కూర్చున్నాను. చుట్టూ వారి సంతానం. పెద్దహాలు. నా ఎదుట కూర్చుని వాదోపవాదాలు వింటున్న సుబ్బరామయ్యగారు అకస్మాత్తుగా లేచి తలుపువైపు పరుగెత్తారు, నన్ను తీసుకొని. నేను ఇదేమిటా అని తిరిగి చూచాను. ప్రభాకరులు! నేనూ విస్తుపోయి లేచి నిలుచున్నాను. ప్రభాకరులు విసురుగా లోపలికి వచ్చి నన్ను గట్టిగా కౌగలించుకొని, గద్గదకంఠంతో ఏదో అనబోయి మాట పెగలక కన్నీళ్ళు కురిపిస్తూ నిలుచుండిపోయారు. నేను ఉక్కిరిబిక్కిరి అవుతున్నాను. సుబ్బరామయ్యగారూ ఆయన కుటుంబంవారూ ఏమీ తోచక మా ఇద్దరి చుట్టూ మూగారు.

ప్రభాకరులు తెప్పరిల్లుకున్నారు. కష్టంతో గొంతు పెగల్చుకొని, నాయనా! నిన్ను ఎంతో నొప్పించాను – అన్నారు. మరి మాట రాలేదు. నాకు తలకొట్టేసినట్లు అయింది. మా చుట్టూ మూగినవారికి ఏమీ అర్థంకాలేదు. తప్పంతా నాదే అన్నాను. ప్రభాకరుల కంఠం సడలింది. అబ్బే! నీ తప్పేమీ లేదు. మద్రాసుకు మద్రాసే బీచిలో విరగబడగాలేనిది, నీవు నా పిల్లలను తీసుకొనిపోతే తప్పా! నేను అక్కడికి వచ్చిన వారినందరినీ శాసించగలిగానా? ఇంతకూ నా అహంకారంగాని, నా కిష్టం లేనిదంతా ప్రపంచానికి ఇష్టం కాకూడదనేది ఏమి తత్త్వం? గాంధీజీకి ఎదురు తిరిగాడు గదా అని నొచ్చు కున్నాను. రేపు అతడే మారవచ్చు. నా సిద్ధాంతాలు, విధానాలు ఇతరులపై రుద్దడానికి నేనెంతటివాడిని? – అని అలా నిలబడే గంటసేపు అహంకారం గురించి, పశ్చాత్తాపం గురించి, దయ గురించి ఎంతో చెప్పారు. మానవ జీవితం ఒక పట్టుపీతాంబరం. దాని పడుగుపేకలు భూతదయా, పశ్చాత్తాపాలు. వివేకమనే కండె ఆసుతో అటుఇటు తిరుగుతూ జీవితాన్ని అల్లుతుంది. ఒకొకప్పుడు ఆ కండె అడ్డంగా దూరుతుంది. నేత తప్పుతుంది, తెగుతుంది, ముడుతలు వస్తాయి – ఇంకా ఏవేవో దృష్టాంతాలు చెప్పారు. నేను గుర్తు పెట్టుకొన్న దింతే.

సుబ్బరామయ్యగారు, తక్కినవారూ మంత్రముగ్ధుల్లా నిలబడి వింటున్నారు. జరిగింది ఊహించుకొన్నారు. శాస్త్రిగారు మాయింటికి దయచేసి ఎన్నియేళ్ళు అయ్యాయో! ఈయన మూలంగానైనా దయచేశారు. చాల ఆనందిస్తున్నాము – అన్నారు. సుబ్బరామయ్య, ఆయన సతీమణి సుబ్బాయమ్మగార్లు. ప్రభాకరులు వారి ఆదరసత్కారాలు పొంది వెళ్ళిపోయారు.

సుబ్బరామయ్యగారి కుటుంబానికి జరిగిన కథ చెప్పడానికి గంట పట్టింది. మధ్య మధ్యన ఏవోకథలు, ఉపకథలు, ప్రభాకరుల పశ్చాత్తాప గాథలను సుబ్బరామయ్యగారూ కొన్ని చెప్పారు. ఇది మనఃపరిపాక పరాకాష్ఠ, మానవత్వ చరమసీమ.

ఆర్తుల విషయంలోను, విద్యార్థుల విషయంలోను వారి ఆవేదన అదే విధంగా ఉండేది. ఏదో చేయాలనే ఆక్రందన. దానికి మూలం భూత దయ. వారి దయాశీలతకు కొన్ని వందల దృష్టాంతాలు ఉదహరించవచ్చు.

ప్రభాకరులు గొప్ప మనస్వి. మనస్వి మనస్సు అతిగహనం. ఒక కవి మనస్వి స్వభావాన్ని ఇలా వర్ణించాడు:

**ఉపకారే2పి దూయంతే న సహంతే2నుకంపితామ్,**
**అపత్స్వపి దురారాధ్యాః నిత్యదుఃఖా మనస్వినః**

అని. (మనస్వి ఉపకారం చేద్దామంటే కష్టపడతాడు. చేయనీడు. దయదలచడం సహించడు. దయ ఎవడికి కావాలి? భగవంతుని దయ చాలునంటాడు. ఆపదలో వున్నాడు, తోడ్పడదామన్నా ఒప్పుకోడు. నిరంతరం కష్టాలన్నా పడతాడుగాని, మరొకరి దయాధర్మభిక్షలు సహించడు.)

ఇలాంటి మనస్విని తలదన్నినవారు ప్రభాకరులు. మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో జూనియర్ లెక్చరర్ పదవి ఖాళీపడింది. విశ్వవిద్యాలయాధికారులకు ప్రభాకరులు ఆ పదవికి వస్తే బాగుంటుందని ఉండేది. సెలెక్షన్ కమిటీలో అప్పటి కాంగ్రెస్ మహానాయకుడు సత్యమూర్తి, పిఠాపురం రాజాగారూ ఉన్నారు. ప్రభాకరుల హితచింతకులు కొందరు వారిద్దరినీ కలుసు కోమని సెలవిచ్చారు. సత్యమూర్తిగారు పార్థసారథిస్వామి తేరువీథిలో, ప్రభాకరులున్న వేంకటరంగం పిళ్ళెవీధికి చాల దగ్గరగా ఉండేవారు. నాకున్న చనువు కొద్దీ నేనూ ఆ మాటే విన్నవించాను. ఒక సాయంకాలం ఆఫీసు నుంచి ఇంటికి వెళుతున్నప్పుడు, ప్రభాకరులు ఒక క్షణం ఆగి నన్ను ఎగాదిగా చూచారు. విద్యారణ్యులు, వేదాంతదేశికులూ సహాధ్యాయులట. వేదాంతదేశికులు శిలావృత్తితో జీవించి సాహిత్య వేదాంతాలకు అనితరసాధ్యమైన సేవ చేసినవారు. విద్యారణ్యులు ఒకమారు ఎందుకలా దరిద్రంతో బాధపడతావు, విజయనగరానికి రారాదూ అని వార్తాహరునితో చెప్పిపంపారట. వేదాంత దేశికులు దానికి సమాధానంగా వైరాగ్యపంచకం అని ఐదు శ్లోకాలు వ్రాసి పంపారట. నీవు వైష్ణవవంశంలో పుట్టావు గదా నీకు ఆ శ్లోకాలు వచ్చా? - అని అడిగారు. వచ్చునండీ - అన్నాను. "వాచా యా చమహే న మహేశ్వరాన్" అనే శ్లోకం చెప్పు అన్నారు. అప్పజెప్పాను.

**జ్వలతు జలధిక్రోడక్రీడత్ కృపీటభవ ప్రభా**
**ప్రచలిత బహుజ్వాలామాలాకులో జఠరానలః,**
**తృణమపి వయం సాయంసంఫుల్ల మల్లీమతల్లికా**
**పరిమళముచా వాచా యాచామహే న మహేశ్వరాన్.**

(సముద్రగర్భంలో తిరిగే బడబాగ్నిలాంటి భయంకర జ్వాలలతో జఠరాగ్ని మండుగాక! సాయంకాలాలలో విచ్చే జాజిమల్లెల వాసనలు వెలార్చే మామాట లతో రాజులను గడ్డిపోచనైనా యాచించము.)

**దురీశ్వరద్వార బహిర్వితర్దికా**
**దురాసికాయై రచితో2య మంజలిః**

(పాడురాజుల ప్రాసాదాల వెలుపలి అరుగులమీద పడే పాడుపడిగాపులకు నమస్కారం) చాలు. ఇంత తెలిసీ సలహా యిస్తావేం నీవు? - అని గద్దించారు. ఇది లోకం సార్. పక్కనే వున్నారు గదా, నన్ను చూడవద్దా అని సత్యమూర్తిగారు అన్నట్టు విన్నాను. మీరు యాచించ నక్కరలేదు. కనిపించండి చాలు.

అతనికీ కొంత సంతృప్తి కలుగుతుంది. తుష్యతు దుర్జనః అన్న లోకోక్తి ఉండనే ఉంది. అన్నాను. వారు ససేమిరా ఒప్పుకోలేదు. అతనికి అంతగా నాకు సాయం చేయాలని ఉంటే నన్నెరుగడా? నా సంగతి ఎరుగడా? అతని బలగమంతా చికిత్సకు వస్తున్నారే! నేను చూడడం దేనికి? – అన్నారు వారు. మాలో కొందరు పెద్దలు ప్రభాకరులకు తెలీకుండా సత్యమూర్తిగారిని దర్శించి విషయం వివరించారు. ఆయన నన్ను ఒకసారి చూడలేకపోయారా? పక్కవీధే గదా! – అన్నారట ఆయన. శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారికి ఆ పదవి వచ్చింది.

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి నిర్యాణం తర్వాత ప్రభాకరులను మద్రాసు ఆస్థాన పండితులనుగా చెయ్యాలని అప్పటి మంత్రి, వేంకటస్వామి నాయుడుగారు, న్యాయమూర్తి పాకాల రాజమన్నార్ గారు మున్నగువారు అభిలషించారు. బొబ్బిలి, పిఠాపురం రాజాగార్లకు మరొక అభ్యర్థి ఉన్నట్టు విన్నాము. మేమందరం ఒక మారు పిఠాపురం రాజాగారిని కలుసుకోమని ప్రభాకరులను కోరాము. కొందరు మంత్రులు కూడ రాయబారం నడిపారు. ప్రభాకరులు మల్లినాథుడు ఒకప్పుడు చెప్పిన –

**న నటా న విటా న గాయకా**
**న చ సభ్యే తరవాద చుంచవః,**
**ప్రభుమీక్షితుమద్య కే వయం**
**స్తనభారానమితా న యోషితః.**

(ప్రభువును దర్శించడానికి మేమెవ్వరం? నటులం కాము, విటులం కాము, గాయకులం కాము, బూతులు మాట్లాడడంలో మొనగాళ్లం కాము. చివరకు స్తనభారంతో వంగిన మహిళలమన్నా కాము) అనే శ్లోకం చదివారు ఏమన గలం? ఊరకుండిపోయాం.

ఒకసారి నేను ధైర్యం చేసి మిమ్ముల్ను చూస్తూంటే ఆశ్చర్యంగా ఉంది. పెద్ద సంసారం. వచ్చే వాళ్లు, పోయేవాళ్లు. మీ జీతమేమో తెలిసిందే. ఖర్చు జీతానికి నాలుగింతలు. ఎలా గడుస్తూందో! విద్యావంతులకు సుఖం లేదంటే ఇదే కాబోలు! – అన్నాను. రచనలు, పుస్తక పరిష్కరణలు, గ్రంథ ప్రచురణలూ – ఇలా వేన్నీళ్లకు చన్నీళ్లు కలుపుకుంటూ గుడుపుతున్నాను. సుఖమన్నావే అది మానసికమైంది. దానిని నిర్వచించడం కష్టం. ఒకనికి సుఖమని తోచేది మరొకనికి అలా తోచకపోవచ్చు. ప్రాచీన కవిశ్లోకం ఒకటి విను – అన్నారు.

**ఇంద్రస్యాశుచిసూకరస్య చ సుఖే**
**దుఃఖే చ నాస్త్యంతరం**
**స్వేచ్ఛాకల్పనయా తయోః ఖలు సుధా**
**విష్ఠా చ కామ్యాశనమ్,**

**రంభా చాశుచి సూకరీ చ పరమ**
**ప్రేమాస్పదం మృత్యుతః**
**సంత్రాసోఽపి సమః స్వకర్మ గతిభి**
**శ్చాన్యోన్యభావః సమః.**

(ఇంద్రుని **సుఖదుఃఖాలకు,** మురికిలో మగ్గే పంది సుఖదుఃఖాలకూ, తేడా లేదు. ఇంద్రుడు కోరే భోజనం అమృతం. పంది కోరే భోజనం **అమేధ్యం.** అవి స్వయంగా కోరుకున్నవి. ఇంద్రునికి రంభ, పందికి మురికిలో మెలిగే ఆడపంది పరమ ప్రేమాస్పదం. ఇంద్రునికి, **పందికి** మృత్యుభయం సమానం. వారి వారి కర్మలను బట్టి పరస్పర భావాలు సమానమైనవి.) కనుక **సుఖమన్నది,** దుఃఖమన్నది **పిపీలికాది** బ్రహ్మపర్యంతం సమానమని మన పెద్దలు చెప్పారు. ప్రపంచసుఖం మనలక్ష్యం, మనసుఖం **కాదు.** ప్రపంచమంతా అజరామరంగా, నీరోగంగా ఉండే దారి చూడాలి. అదే సి.వి.వి. సిద్ధాంతం - అన్నారు **ప్రభాకరులు.**

కరుణామయులు, పశ్చాత్తాప తపస్తప్తులు అయిన ప్రభాకరుల సత్సంగంలో **జాలువారిన ఇలాంటి** ముచ్చట్లను ఎన్నిటినైనా చెప్పవచ్చు. వారి మానవం అలాంటిది. వాటిని అవగాహించుకొని, **మననం** చేసుకోడం, వారికి నమస్కరించడం, ఆనాటి ప్రేమనే ఈనాడూ నాపై కురిపిస్తున్న సోదరులు సుందరమూర్తి, గురుప్రసాద ఆనందమూర్తులకు కృతజ్ఞత తెలుపడం తప్ప మరేమి చేయగలను? (మానవం అనేదాన్ని మానవత్వం అనే అర్థంలో వాడాను.)

ఇంతమంది పెద్దలతో పరిచయమైనా, నా మనస్సు ఏమీ పరిపక్వం కాలేదే? - అని ఒకమారు నా అర్ధాంగి అనంతలక్ష్మితో అన్నాను. ఆమె ఒక మందహాసం చేసి, పత్రికలలో టెలీప్రింటర్లు ఉంటాయే - అలాంటి మనసు లేని యంత్రం మీరు. మనసే లేనప్పుడు పరిపాక మనేది ఎక్కడిదండీ? - అన్నది.

* * *

# మా మనో ఫలకంపై శ్రీ శాస్త్రిగారు

- వరలక్ష్మి

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారికి ఎల్లవేళలా నా మనసులో చేసుకునే నమస్కారాన్ని ఈ రోజు ఈ వ్యాస ప్రారంభంలో కూడా సవినయంగా చేస్తూ, ఈ అవకాశాల్ని శ్రీ శాస్త్రిగారే నా మీద ప్రేమతో పెద్ద మహాసభలో కొంత మంది చిన్నపిల్లలకి కూడా ఓ పాట పాడటానికో, పద్యం చెప్పడానికో ప్రోత్సాహమిచ్చి సంతసించే పెద్దల్లాగా, వారి గురించి నాకు ఎప్పుడూ గుర్తుకు వస్తే కొన్ని విషయాలని ఆనందంగా పంచుకునే దీవెన ఇచ్చారని అంజలి ఘటిస్తున్నాను.

ఇంతకీ శ్రీ శ్రాస్త్రిగారు నాకు ఎలా తెలుసు? వారి గురించి నిరంతరం స్మరించే లాగా ఎలా సంభవం? నేను శ్రీ శాస్త్రిగారిని నా భౌతిక నేత్రాలతో ఎప్పుడు చూడలేదు. వారి స్వరం వినలేదు. వారి పాదస్పర్శకి కానీ, కర స్పర్శకి కానీ నోచలేదు. కానీ ఇవేవీ నన్ను వారి పట్ల ఇనుము అయస్కాంతానికి ఆకర్షితులైనట్లు ఆకర్షింపబడటానికి అవరోధాలు కాలేదు. దీనికి కారణం శ్రీ కొత్త రామకోటయ్యగారు. శ్రీ ప్రభాకర శాస్త్రుల వారి యోగ శిష్యులలో ఒకరైన శ్రీ 'కొత్త' రామకోటయ్యగారికి తమ పూజ్య గురు 'భాగవతం', శ్రీ ప్రభాకర భాగవతమే నిత్య జీవనం. శ్రీ రామకోటయ్యగారు (తాతగారు) మాట్లాడేది ఎప్పుడు వారి గురువుగారి గురించే. వారు ఎలా జీవించారో, ఎంత ప్రేమామయులో, ఎంత గొప్ప పండితులో ఎంత నిరాడంబరులో ఎంత నిస్వార్థపరులో, ఎలా తమ గురువుగార్రైన మాస్టర్ సి.వి.వి. గారికి సంపూర్ణ సమర్పణతో జీవితమంత పరహితముతోనే గడిపిన ధన్యజీవులో.. ఇదే మేమందరం తాతగారి చుట్టూ చేరి వీరి గోష్ఠులలో మైమరచి మళ్లీ మళ్లీ వింటూ, తాతగారి మానసవీధులలో వారి హృదయంలో వున్న శ్రీ శ్రాస్త్రిగారిని తాతగారి కళ్లల్లో, తాతగారి మాటల్లో తాతగారి రచనల్లో 'మా శాస్త్రిగారు' అనేలా దగ్గర అయ్యాం. ఈ రచనలో శ్రీ తాతగారు మాతో పలుమార్లు పంచుకున్న శ్రీ శాస్త్రిగారిలోని కొన్ని లక్షణాలు, మనుషులని మనీషులుగా చేసి, దివ్యత్వం వైపు నడిపే జ్ఞానకిరణాలు, ప్రేమ తరంగాలు ఉదహరిస్తున్నానంటే, శ్రీ తాతగారు శాస్త్రిగారు అనే ఒక అనంత ప్రేమసాగరుల గురించి, ఆ సముద్రంలో మునకవేసిన వారి నుంచి, కేవలం ఒడ్డు మీద కాదు తుంపరులుగా గ్రహించిన తేనె చినుకులనీ మనవి.

మహాత్మాగాంధీగారి గురించి ఐన్‌స్టీన్ మహానుభావుడు ప్రశంశాపూర్వకంగా గౌరవ పూర్వకంగా అన్న మాటలు శ్రీ శాస్త్రిగారి పట్ల కూడా అక్షర సత్యాలే. ఇలాంటి మహానుభావుడు ఈ భూమి మీద నడచాడని ముందు తరాల వారు నమ్మకపోవచ్చు.

**భూమిని సురులుందరటం**
**చీ మాదిరిగాగ నాడు నెరుక పరుపగా**
**భూమీ సురు శ్రీ ప్రభాకర**
**స్వామినే గనుగొంటి నేను సచ్చిన్మూర్తిన్"**

– శ్రీ కారా. నామాట నుండి

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు కవి, పండితుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి అని గౌరవించేవారు కొందరైతే, వారు మహాయోగి, సి.వి.వి. ఉపాసకులనీ, రాజయోగులనీ పూజించేవారు కొందరు. వారే తమ తల్లీ, తండ్రీ, గురువు, దైవము, సఖుడు అని తమ జీవిత సర్వస్వం అనుకునే వారింకొందరు. శ్రీ శాస్త్రిగారి 'విశ్వరూపం' దర్శించడం అరుదుగా, అదృష్ట వంతులకు, లోదృష్టికల ప్రజ్ఞాశాలులకే, వారి ఆశీస్సులతో సాధ్యం.

గొప్పవారు ప్రత్యేకంగా ఏవో, ఎవరూ చేయని పనులే చేస్తారా, లేక సాధారణ మానవులందరూ చేసే పనులనే అసాధారణ విలువలతో చేసి మార్గదర్శకులవుతారా? శ్రీ శాస్త్రిగారు అందరూ నడిపినటువంటి గృహస్థ జీవితమే గడుపుతూ, అందరిలాగా ఉద్యోగం చేస్తూనే వున్నా, అడుగడుగునా సమత, మమత, మానవత, ప్రేమ, నిస్వార్థం, భగవదర్పణ ఆచరించి చూపిన బ్రహ్మణ్యులు, వందనీయులు. వారి ఆదర్శాలకి పునాది వారిలో నుండి వచ్చిన ఆత్మ ప్రేరణ వల్ల, ఆత్మోద్బాధమువల్ల, సమదర్శకత వలన కనుక అని నిశ్చలంగా, ధైర్యంగా ఆచరించారు.

**'తనకుమాలిన ధర్మం'** వుండదని భావించే ఈ ప్రపంచంలో, దానికి పూర్తి భిన్నంగా తాను నడచి, తన శిష్యులకి కూడా అదే ఆదర్శంగా ఉపదేశించిన 'ఆకాశ జ్యోతి' శ్రీ శాస్త్రిగారు. ఈ శరీరం నిలచి వుందన్నా, ఆరోగ్యంగా వుందన్నా, ఆ పరమేశ్వరుని కృప వల్ల నీకు సకల సమృద్ధులు వున్నాయన్నా, అవి నీ ఒక్కడికే, నీ కుటుంబానికే పరిమితంకావనీ, జీవిత ఉద్దేశ్యమే 'ఉపకారము చేయుకారక' ఉండగ వలయుననీ తమ ఆఖరి శ్వాస వరకూ అనుసరించిన మహోన్నతులు మనసా, వాచ కర్మణా, ఎల్ల వేళలా ఇతరుల పట్ల ప్రేమతో, ఆర్తితో, ఆర్ద్రతతో, వారి క్షేమం కోసం, ఆరోగ్యం కోసం, ఆనందం కోసం, ఆత్మ అభ్యుదయం కోసం పరిగ్రహించిన బ్రహ్మఋషి శ్రీ శాస్త్రిగారు. 'తన' తనం ఎరుగరు. 'తన', 'పర' అనేది వారి ఆలోచనలకి దూరం. అంతా 'మన' తనమే. అందరూ ఆ పరత్పరుని రూపాలే అని లోని నిజాన్ని

ఎరిగి, తెలియపరచిన యోగి ఆయన. నిరంతరం ఆత్మశోధన చేసుకుంటూ, ఎప్పుడూ తన గురువులని శరణువేడి, తమని పొరపాటునయినా సన్మార్గం నుండి దూరం కానీయకుండా కాపాడమని వినతి చేసుకునే వినయ మూర్తి.

**ఏను కారణముగ నెవ్వడేని సంకటం పడనటు నన్ను సాకుకానుము**
**ఆగ్రహ నుసూయ గర్వ మిత్యాదులైన చెడుగు లుడిగింపు మికనన్ను చెందకుండా**

(మా శాస్త్రిగారు పుట. 1. 6)

**పఠింతున్ మతదేశ జాతి కృతముల్ వైవిధ్యముల్ వీడి ని**
**ర్వర్తంతు బరిచర్య నర్తులకు యాదత్సజ్ఞానర్పించి యా**
**వర్తింతున్ గురుదేవ సూక్తములు భవస్ఫూర్తి నట్టయ్యునే**
**ధూర్తుండౌదు నాకొక్కచో నడపుమీ తుందుద్కు నాత్మేశ్వరా!**

(ప్రభాకర స్మారిక పుట. 144)

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు కవి, పండితుడు, భాషావేత్త, విమర్శకుడు అనీ వారి కృషి - Archeology లో అనితర సాధ్యం అనీ యావదాంధ్రప్రదేశము ప్రణమిల్లుతుంది. ఇంతటి ప్రతిభాశాలికి ఈ సరస్వతీ కటాక్షం వల్ల వెల్లువగా వచ్చే కీర్తి, ప్రతిష్ఠ, ధన సంపత్తుల పట్ల వ్యామోహం క్షీణించి, 'యావత్ మానవ ఉద్ధరణ, అమృతత్వ సిద్ధి వైపు మనసు లగ్నం అవడం మానవాళి చేసుకున్న అదృష్టం. మనలోని అవిద్య దోష పాషాణము లని తొలగించడము, 'జరామరణము' లనే చీడలు తొలగించి మన పుట్టువు చెట్టున్ సఫలీ కరించుకొనే మాలిగా మన తోటలో అంటులో గట్టెద' అని తన విశ్వమానవ కళ్యాణకారి అయిన నవ్యయోగములోని పాత్రకే ప్రాముఖ్యత ఇచ్చారు.

శ్రీ కొత్త రామకోటయ్య తాతగారు, పలువురు పలువిధాలుగా, తాము చూపే దృష్టికోణాన్ని బట్టి తమలోని గుణాలని బట్టి మేలిరత్నం లేక 'మాణి'ని గ్రహిస్తారు అని చెబుతూ, సత్య సందర్శనము కావాలంటే ఇంకొంచెం ఉన్నత స్థాయి నుండి చూడటం అవసరమని చెబుతారు. మహానుభావులయిన శ్రీ ప్రభాకర శాస్త్రిగారి ఔన్నత్యాన్ని లేశమయిన అంచనా వేయాలన్న, 'యోగాలయిన్‌లో' ఫిట్టయితేనే సంభవం అంటారు.

**గురువరుడౌ ప్రభాకరుని గొప్పలు నెన్న దరంబె పృథ్విలో**
**హరిహర బ్రహ్మమూర్తులకు అందని తావున వెల్గు శ్రీ పరాత్**
**పరుడగుటన్ దదీయగుణ వర్ణనలీల లగమయ్యనట నీ**
**ధరమనకెట్లు దెల్లమగు దగ్గురు స్తోత్రము జేయ తృప్తిగా**

(శ్రీ కా.ర.)

శ్రీ ప్రభాకరుల శిష్య వాత్సల్యము, వారి యోగ కుటుంబంలో వెల్లివిరిసిన, వెల్లివిరిసే ఆత్మీయత సేవ తత్పరత తలచిన కొలదీ అందరినీ నిత్యానందంలో నింపి అప్రయత్నంగానే అందరిలో 'ఇతరులకై జీవించాలి' అనే కిరణాలని ఉదయింప చేస్తాయి. శ్రీ ప్రభాకరులు మాస్టర్ C.V.V. గారిని దర్శించిన ఘట్టం, శ్రీ కొత్త రామకోటయ్యగారు శ్రీ ప్రభాకరులని దర్శించిన ఘట్టం ఎన్నిసార్లు విన్నా, నిత్యనూతనంగానే మనోవీధిని ఆనందంలో నింపుతాయి, 'మంత్రమహిమ' గల ఈ సంఘటలలో శ్రీ తాతగారు కాల పరిధులని అధిగమించి ఎప్పుడూ మమ్మల్ని కుంభకోణానికో, తిరుపతిలోని శ్రీ శాస్త్రిగారి ప్రేయరు గదికో తమతోపాటు పుణ్య తీర్థ దర్శనం చేయించేవారు.

బ్రహ్మణ్యులుగా, బ్రహ్మజ్ఞానిగా, రాజయోగిగా, సచ్చిదానంద స్వరూపులుగా శ్రీ ప్రభాకరులు 'ప్రేమ' అనే నావలో, 'మాయ' ఆవరణలు దాటి, తమ సద్గురువులు శ్రీ మాస్టర్ C.V.V. గారి వెలుగుకి వాహికగా, ప్రజ్ఞానంద మూర్తిగా చరిస్తూ, తాము విశ్వసించిన నూతనయోగంలో ఇంతకు ముందు ఏ మహాత్ములూ అధిరోహించని కొత్త స్థాయికి పరిణితి చూపి, తమ శిష్యులలో కూడా అదే పరిణితి తేగచిగిన గురువరేణ్యులు. తమ మార్గం గురించి గొప్పగా, వేరొకరి మార్గం, మతం, ఆలోచన, ఆచరణ తక్కువగా మాట్లాడటం శ్రీ శాస్త్రిగారు ఎప్పుడూ చేయక, ఈ అంశంలో కూడా నేటి ప్రపంచానికి ఆదర్శులే. తోటివారి మేలు, సమిష్టి అభ్యుదయం తప్ప వ్యక్తిగత ప్రగతి, ఈ భూమిని కాదనే ముక్తి శ్రీ శాస్త్రిగారి యోగ ప్రణాళికలో లేవు. ఒక రకంగా మానవ క్రమ పరిణామంలో ఇది కొత్త చిగురు.

మనకి అద్భుతాలు, అసంభవాలు అనిపించే ఎన్నో విషయాలు శ్రీ ప్రభాకర శాస్త్రిగారికీ, వారి వాహికలైన వారి యోగ పుత్రులకీ, పుత్రికలకీ ఎంతో మాములు విషయాలు. ఆది వ్యధులని నివారించడం, ప్రకృతిని – వానలు, వరదలు, అగ్నిప్రమాదాలు నిగ్రహించడం, భూత భవిష్యత్ వర్తమానాలు కాలరేఖలని అధిగమించడం – ఏవీ విడ్డూరాలు కావు వీరికి. దీనికి మూలం వీరికి మాస్టర్ యందున్న పూర్ణ సమర్పణ. తద్వారా ఆ మాస్టర్ లోని అనంత జ్ఞాన, ప్రజ్ఞ, ఆనందాల గంగ వీరిలోకి కూడా ప్రేమామృతంగా ప్రవహించడమే! శ్రీ రామకోటయ్యగారికి శ్రీప్రభాకరులు దర్శనం, రక్షణ, ఆదేశాలు వారు సశరీరులుగా వున్నప్పటి లాగే వారి భౌతికం వీడిన తర్వాత కూడా జరుగుతూనే వున్నాయి. తాతగారు అన్నిటికీ "నాదేముంది? అంతా గురువుగారే" అనడం మేము నిరంతరం చూసేవారం తాతగారి సన్నిధిలో. శ్రీరామ కోటయ్యగారు తను శరీరాన్ని వీడి ముప్పయి ఏళ్లు దాటినా, ఈ రోజుకీ శ్రీ ప్రభాకరులకే శ్రీ తాతగారికీ వున్న గురుశిష్యసంబంధం, వారు కలిసి జగత్కళ్యాణానికి పనిచేయడం కొనసాగుతూనే వుంది. వారి మాటలలోనే ఇది ఎన్నో జన్మల బంధం, ఇంకా ఎన్నో జన్మలవరకు కొనసాగే యోగ ప్రణాళిక. ప్రేమ యొక్క అపూర్వ శక్తి క్రమక్రమంగా విశ్వవ్యాపకం కావాలనీ, భవిష్యత్తులలో **'వినాశాయచ దుష్కృతం'**

అంటూ అవతారాలు రానవసరం వుండదనీ, ఈ పుడమి మచ్చులులేని దివ్యతేజోరాశిగా వుండాలని ఈశ్వరుడిని ప్రార్థించే శ్రీ వేటూరిప్రభాకరశాస్త్రిగారికీ, వారి తలపులు మాలో సజీవంగా నడయాడేలా చేసిన శ్రీ తాతగారు, కొత్త రామకోటయ్యగారికీ వినమ్రంగా నమస్కరిస్తూ, వారి ఆశీస్సులతో నూతనయోగం మనందరిలో జరగాలనీ ప్రార్థిస్తున్నారు.

**తలపులు విశుద్ధములుగా**
**దలపింపుము పలుకు లమృత ధారలనంగా**
**బలికింపుము కార్యంబులు**
**సలిపింపుము పరహిత ప్రశస్తంబులుగాన్**

(శ్రీ.వే.ప్ర.శా)

వారి జీవితేమే వారి సందేశమైన శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులుగారికి పాదాభివందనాలు.

* * *

# కారణజన్ములు

**- చింతగుంట శివానందరావు**

పరమపూజ్యులు శ్రీప్రభాకరశాస్త్రిగారు కారణజన్ములు. వారు గౌతమబుద్ధుని ముఖ్యశిష్యులలో ఒకరుగా భావన. పూజ్యరామకోటయ్య తాతగారు యీమాటను పలుమార్లు ఉపయోగించిరి. శ్రీశాస్త్రిగారిది పరమప్రేమ. వారు ఏ ఒక్క ప్రాణికోటి యిబ్బందికి గురైనా, వారు ఆబాధ తనకు కలిగినపుడు ఎంత బాధపడుదురో అంతకన్న ఎక్కువగా ఇతరులకై బాధ పడుదురు. "లోకాస్సమస్తాస్సుఖినో భవంతు" అన్న వాక్యసార్ధకము శ్రీశాస్త్రిగారికి నూటికి నూరుశాతము వర్తించును. వారు కులము, మతము, దేశము అనే పరిధులు దాటిన పుణ్యమూర్తులు. యావత్ ప్రపంచము ఒక unit గా తలంచు ఉన్నతమూర్తి. సామాన్యజనులు మనదేశము, మన కులము, మన కుటుంబము అను పరిధిలో ఉందురు. వారు ప్రపంచములో అందరూ వారివారి ప్రజ్ఞను బట్టి ఉద్ధరింపబడుదురు గాక అను భావన కలిగిన విశాల హృదయులు.

వారు తెలిసి చెప్పినా తెలియక చెప్పినా వారినోట వచ్చిన వాక్యమును జరుపుట భగవానుని కర్తవ్యము. వారు 60 సంవత్సరములు దాటిన వారి సహఉపాధ్యాయుని చూడకయే ,,సుపుత్రాప్రాప్తిరస్తు,, అనిరి. ఆ వాక్యము నెరవేరి తీరినది. వారు పండంటిబిడ్డను పొందిరి. శ్రీపోచిరాజు శేషగిరిరావుగారు టైఫాయిడు జ్వరమునకు గురై నలభై రోజులు మంచము పట్టిరి. జ్వరము తగ్గిన రెండవదినము వారికి విద్వాన్ ఫైనల్ ఎగ్జామినేషన్. వారి గురుదేవులైన శ్రీప్రభాకరశాస్త్రిగారితో ,,నేను ఈ సంవత్సరము ఫైనల్ పరీక్ష drop చేసుకుని తరువాత సంవత్సరము పరీక్ష వ్రాసెదనని చెప్పిరి. దానికి గురుదేవులు నిరాకరించి యీ పరీక్షయే వ్రాయమని ఆదేశించగా గత్యంతరములేక గురువుగారు చెప్పినట్లు పరీక్షకు హాజరైనారు. పరీక్షాకేంద్రమందు ఓపికలేక దాదాపు గంటన్నర డెస్కు పైనే నిద్రించి అప్పుడు లేచి గురుదేవులకు నమస్కరించి పరిక్షను వ్రాయ ప్రారంభించేవారు. ఆవిధంగానే పరీక్షలన్ని వ్రాసి ఆసంవత్సరం యూనివర్సిటీ ఫస్టు సాధించిరి. ఇది మానవమాత్రులకు సాధ్యమా! అంతటి శిష్యవాత్సల్యత శాస్త్రిగారిది.

వారు ప్రతిప్రాణికోటిని భగవానుని స్వరూపముగా భావించెడివారు. మనము తీసుకునే పదార్ధములను కూడా భగవత్ప్రసాదముగా భావించమని తెలిపెడివారు. వారివద్దకు వచ్చు శిష్యులను అల్పాహారము చేయుటకు వెళ్ళినపుడు నీకు మొదటగా కనిపించిన హోటలులోనే భుజింపుము అది మంచిహోటలా లేక పూరిగుడిసె హోటలా అను భేదమును పాటింపకు అని చెప్పేవారు. సమస్తము భగవత్ప్రసాదముగా తలంచమని చెప్పిడివారు. వారి శిష్యులు కూడా గురుభావనను హృదయస్థం చేసుకుని అలాగే ఆచరించేవారు. సత్యవాక్కు

పరోపకార చింతన కలిగి ఉండవలెనని శిష్యులకు సదా సూచిస్తుండేవారు. శ్రీమంతుడైనా, పూటగడవని కడుపేదవాడైనను వారిరువురూ భగవానుని ప్రతిరూపములుగా దర్శించిన మహానుభావులు వారు.

ఒకమారు ఒక క్షయవ్యాధిగ్రస్తుడు వారి వద్దకు అనారోగ్యబాధతో వచ్చిరి. ఆ రోగిని శాస్త్రిగారి దగ్గరకు వెళ్లమని ప్రోత్సహించి పంపినవారు, శాస్త్రిగారికి పొగత్రాగటాన్ని సహించరు కనుక నీవు ఆ అలవాటు కలదని శాస్త్రిగారికి తెలుపకుమని, సలహా చెప్పి మరీ పంపిరట. కాని వారికి ఆ విషయము తెలిసి, నీవు ఆరోగ్యవంతుడవు అగుటకు పొగ మానవలసిన అవసరము లేదు, దాని ఎడల నీకు విరక్తి కలిగినపుడు మాత్రమే మానము, నిన్ను ఆరోగ్యవంతుని చేయు పరమేశ్వరునికి ఇటువంటి అడ్డంకులు ఆపజాలవు,, అని సెలవిచ్చిరి. అనంతరము వారు ఆరోగ్యవంతులై ఆలిండియా రేడియో ఉద్యోగిగా చేరి వృధ్ధాప్యము వరకు జీవించిరి.

ఒకమారు వారు **శ్రీరామకోటయ్య తాతగారితో** నేను పీల్చు శ్వాస శ్రీశాస్త్రిగారే! నేను విడుచు శ్వాసా శ్రీశాస్త్రిగారే! అని **తెలిపిరి. శిష్యులు సాధకులు** వారి ఎడ అంతటి అపారమైన గురుభక్తి, ప్రేమ కలిగిఉండెడివారు.

# ప్రజ్ఞానమయులు

- యం. శ్యామల

"తెలియచీకటికి దీపమెత్తక పెద్దవెలుగు లోపలికి వెలుగేలా" అంటారు. శ్రీఅన్నమాచార్యులవారు. కనులుండీ, చుట్టూ వెలుగుండీ నిండు చీకటిలో తడుముకుంటున్న మాబోటివారికి పూర్ణకరుణాంత రంగులైన శ్రీప్రభాకరశాస్త్రిగారి గురించి తెలియచెప్పిన, చెప్తూన్న శ్రీకొత్తరామకోటయ్య తాతగారికి నమస్సులు. రామకోటయ్య తాతగారు, శ్రీప్రభాకరశాస్త్రిగారి యోగకుటుంబములోని వారు. వీరు శాస్త్రిగారికి శిష్యులు. మనలో చాలామందికి తాతగారుగా సుపరిచితులు. వారి దయవలన శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారనే ముముక్షువు అండ మాకు దొరికింది. అట్టివారిని స్మరించేందుకు తగు అర్హత లేకున్నా ఇందుకు అనుమతించారంటే అది వారి కరుణావిస్తారపు వెల్లువే తప్ప అన్యము లేదు.

సహజంగా ఎవరికివారు ఏవో కొన్ని రంగాలలో ఎదగటమే చాలాగొప్ప. తన చుట్టూ ఉన్న పరిమితులను అవలీలగాదాటి శ్రీశాస్త్రిగారి ప్రజ్ఞ బహుముఖంగా విస్తరించి వివిధ రంగాలలో ఉన్నతశిఖరాలను చేరిందని పెద్దలు చెప్పటం విన్నపుడు ఆశ్చర్యానందాలు కలుగుతాయి. ఏకాగ్రత, సమగ్రత, ఆర్ద్రత, సమయస్ఫూర్తి, నిరంతరప్రజ్ఞ, భగవదభిముఖంగా నడవటం ఇవన్నీ ఏకధారగా అయి శ్రీశాస్త్రిగారుగా మలచబడ్డారేమో!

శ్రీప్రభాకరశాస్త్రిగారు సాహితీమూర్తిగా  లోకంలో ప్రసిద్ధులైన వారి లక్ష్యం లోకకల్యాణమే!. సాహిత్యప్రయోజనం కూడా విశ్వకల్యాణమే అయి ఉండాలంటూ వారు తమ ప్రజ్ఞాప్రభాకరము, మొదట్లోనే చెప్పటం జరిగింది.

పరుషము నిష్ప్రయోజనమబద్ధమనార్యము చేరరాదు నా
విరచనలందు, డెందము పవిత్రముగా విలసిల్లి సత్యసుంద
రము పరార్థయుక్తమగు తత్త్వమునే వెలయింపగా వలెన్
గురుచరణారవిందములకున్ బ్రణమిల్లెద నట్టి నేర్మికై

మనం గురుచరణాలను ఎందుకు ఆశ్రయించాలీ అంటే పరార్థయుక్తమైన తత్త్వాన్ని వెలయించటానికే తప్ప అన్యానికి కాదని చెప్పారు. సాహిత్యమైనా యోగమైనా పరహితమే పరమధర్మంగా ఉండాలని

ఆచరణాత్మకంగా నడచి చూపినవారు శ్రీశాస్త్రిగారు. వారి సారస్వతసంద్రపు అలలోని బిందువును కూడా నేను తాకలేను. అయినా తాతగారిచే వివిధ సందర్భాలలో వారిగురుదేవుల గురించి వ్రాసిన వాటినుండి ఒకటి రెండు విషయాలు పునఃశ్చరణ చేస్తాను.

మల్లన గణితసార సంగ్రహానికి పీఠికను వ్రాసే సందర్భంలో 1. ఆరంభగణితం అనగా వేదయుగంలో గణితశాస్త్రానికున్న స్థానం, వేదాలలో గణితశాస్త్రాన్ని చెప్పిన సందర్భాలు, వాని ప్రస్తుత ఉపయోగం 2. పురాణయుగంలో గణితశాస్త్ర చర్చ, చర్య (దానిని ఉపయోగించిన విధం) ఇతరదేశాలకు భారతీయ గణిత సంప్రదాయాల వ్యాప్తి ఎలా జరిగింది. 3. సంస్కృతంలో గణితశాస్త్ర గ్రంధాలు (వరాహమిహిరుడు మొదలైనవారివి) ఇక చివరగా తెలుగులో 4. గణితశాస్త్రాలు, రేఖా,బీజ గణితాలు, జ్యోతిర్గణితం, భారతీయగణితం ఆధారంగా విదేశీగణిత తీరులు మార్పుకు లోనైన విధం – ఇలా ఎన్నిటినో అధ్యయనం చేశారట శ్రీప్రభాకరశాస్త్రిగారు. ఒక విషయాన్ని గురించి ప్రస్తావించేటపుడు వారి విషయసేకరణ అధ్యయనము, పరిశోధన, విమర్శ ఏ తీరుగా ఉంటుందో చెప్పేందుకు తాతగారు ఈ విషయాన్ని గ్రంధస్థం చేయటం జరిగింది.

వేంకటాచల విహారశతకంలోని, సంపంగిమాకులు, అనే పదబంధానికి వివరణనిస్తూ తిరుమలలోని వేంకటేశ్వరాలయం చుట్టూ చాలాపూర్వం సంపంగి చెట్లుండేవట. అవి దేవాలయం చుట్టూ తిరుగుతూ గాలి ఎటువీస్తే అటు వైపుకు ఆ సంపంగిచెట్లు జరిగి స్వామివారికి ప్రదక్షిణపూర్వకంగా సువాసనలు వీచేవని అదే విషయాన్ని ఆ శతకకవి ఇలా సమన్వయం చేశారని చెప్పారట.

"సింగినాదం-జీలకర్ర" అనే పలుకుబడి రావటానికి కారణాన్ని చెప్తూ పూర్వం జీలకర్ర చాలా దూరప్రాంతాలనుండి అపుడపుడు అమ్మకానికి వస్తుండేది. అలా అమ్మకానికి తెచ్చినవారు జీలకర్ర తెచ్చినట్లుగా తెలియటానికి బూరలనూదేవారు. అదే సింగినాదం-జీలకర్రగా వాడుకలోనికి వచ్చిందన్నారు. ఇలా ఏ విషయమైనా సంపూర్ణంగా అవగాహన తెచ్చుకుందుకు దాని పూర్వాపరాలు తెలుసుకోవటం, ప్రస్తుతం దాని ఆవశ్యకత, జరగవలసిన మార్పులు, చేర్పులు, సమన్వయవిధం, ఫైలాలజీ మొదలైన ఎన్నో సాహితీ విషయాలలో విద్యార్థులకు తర్ఫీదు నిచ్చేవారట.

**ప్రభావితం –** గాంధీగారి సత్యవ్రతం, అహింసాయుతమైన నడవడిక తనను ఎంతగానో ప్రభావితం చేశాయని శ్రీశాస్త్రిగారు స్వయముగా వ్రాసుకున్నారు. గాంధీగారిని గురించి శాస్త్రిగారికి ఉన్న గౌరవభావాన్ని, విలువను గమనిస్తే వారిని ప్రాణప్రదంగా ప్రేమించేవారనిపిస్తుంది. వారి మరణవార్త విన్నపుడు దుఃఖిస్తూ "పిచ్చి ఎక్కి మదోద్రేకంతో ఉన్న ఏనుగు ప్రేమమూర్తియైన బుద్ధుని చూడగానే మోకరిల్లింది. ఏనుగుకు కలిగినపాటి వివేకము కూడా మానవజన్మ ఎత్తిన వారికి కలుగకపోవటం విచారకరం" అన్నారు.

అయినది దేనిపట్లా గ్రుడ్డి నమ్మకం కాదు. ప్రతి విషయాన్ని ఎన్నో తీరులలో విశ్లేషించి, విమర్శనాత్మకంగా ఆలోచించి తన అనుభవానికి వచ్చినదానినే సహజధర్మంగా అనుసరించాలని పిస్తుంది. అలా విశ్వసించాక సందేహానికి తావుండేదికాదు. అందుకే తాతగారు వారి గురుదేవులైన శ్రీశాస్త్రిగారిని గురుస్తుతి చేస్తూ "అనుభవంబుపైనే ఆధారపడునట్టి చిద్ఘనైకమూర్తి శ్రీగురుండు" అన్నారు.

**యోగలక్ష్యం -** శ్రీశాస్త్రిగారిని మీదమిక్కిలిగా ప్రభావితంచేసి ప్రజ్ఞాప్రభాకరులుగా మనకు అందించినది సత్యయోగమార్గము. ఈయోగం వారి జీవితాన్ని పరిపూర్ణం చేయటమే కాదు వారి ద్వారా ఎందరికో ప్రాణాన్ని, జ్ఞానాన్ని, ఆనందాన్ని అందించటానికి వాహికై నిలచింది. మాస్టరు సి.వి.వి.గారిచే అందించబడిన భృక్త రహిత తారకరాజ యోగమార్గంలో వీరు డైరెక్ట్ మీడియం. సచ్చిదానందపథాన్ని చేరటానికి ఈమార్గం తగినదిగా తోచి దీనిని అనుసరిస్తున్నానని తెలియచేశారు. ఆ పరమపథాన్ని చేరుటకు ప్రేమ, సమత్వము, స్వచ్ఛశీలత ప్రాతిపదికగా తీసుకున్నారనుకుంటా. ఆయా సుగుణాలు వారిని వరించినవిధం, వారి జీవనగమనలో అవి వ్యక్తమైన తీరు మనందరమూ తెలుసుకుని తీరవలసిన సత్యదర్శనాలు. వీరు ఏ సచ్ఛీలత, కారుణ్యత, ప్రజ్ఞానానికి ప్రతీకగా నిలచారో వాటినే తనను చేరవచ్చిన వారికి దివ్యఫలాలను అందించారు.

ఈ యోగంలో వారు పొందిన అనుభూతులు ఒక ఎత్తైతే తనలో సహజంగా నెలకొన్న కరుణభావనకు యోగసాధనను తోడుచేసి తత్ఫలితంగా ఉద్భవించిన ఆత్మశక్తితో పరుల వేదనలను పోగొట్టి ఎందరినో భాగవతీయమైన స్పృహను పాదుకొల్పారు. అలా యోగం వారిలోని ప్రేమ, సమహితభావనలను మరింత విస్తరింపచేసి విశ్వమయం చేసిందని తోస్తుంది.

మాస్టరుయోగం గురించి వారు వెల్లడించినవాటిలో కొన్ని - ఈ జీవితకాలంలోనే బ్రహ్మమును చూపిస్తానన్నది ఏదై ఉంటుంది. బ్రహ్మమును చూపిస్తానన్నది అదే అయితే తప్పు వీలుపడదు. ఇతరులెవ్వరికీ అట్టి అధికారము లేదు. యోగంలో చేరిన పది సంవత్సరములకుగాని మాస్టరే ఆరిజిన్ అనే నిర్ణయం నాకు కలుగదయ్యెను. వారే బ్రహ్మమని నా నిశ్చయము. ఎవరూ చలింప చేయరానిది. నీలో సదా నేనుందును. "నీకు కావలసిన సహాయము చేయుచునే ఉందును" అని మాస్టరు చెప్పిన భావన అనుభూతికి రాసాగింది. అప్పటినుండి నాలో ఉద్భోధ అనే ఊట ఊరసాగింది. సుపవిత్రంగా మనం వ్యవహరిస్తే మనమూ పరబ్రహ్మతత్వమును తాకగలము. వినిర్మలమైన నిర్దోషమయిన జీవితం ఉంటే ఎంతకాలమైనా జీవింతుము. మన శరీరం స్ఫటిక స్వచ్ఛమైతేగానీ మనమూ ప్యూర్‌ను పొందలేము. అప్పటికిగాని ఆ తేజస్సు మనలను తాకుటకు వీలుండదు. ఈ లైను ప్రకారము ఇండిపెండెన్స్ అంటే తన్ను తాను రియలైజ్ చేయటం. తన ఇన్నరును తాను చూడగలిగిన సెంటర్‌ను టచ్ చేసిన వాడే ఇండిపెండెంట్ మేన్. మనలోనుండి పుట్టే

సంకల్పము అంతా కూడుకుని సెంటర్‌ను ఫిక్స్ చేస్తుంది. సెంటర్ ఇంకా ఫామ్ కాలేదు. నిల్‌లో నుండి క్రియేషన్ స్టార్టయింది. అది ఫుల్‌గా స్టాండ్ కాబోతుంది.

**శిష్యవాత్సల్యత** - శ్రీశాస్త్రిగారికి యోగపరంగాను, సాహితీపరంగాను, విద్యాపరంగాను, సంఘపరంగాను ఎందరో శిష్యులున్నారు. ఎందరి జీవితాలో వారివలన ప్రభావితమయి చక్కబడ్డాయి. అవన్నీ రికార్డులలోనికి ఎక్కి ఉండకపోవచ్చు. కొందరి అనుభవాలు మాత్రమే అక్షరరూపమయ్యాయి. వారు ప్రత్యక్షంగా మాలో చాలామందికి తెలియకున్నా వారి శిష్యప్రశిష్యులద్వారా శ్రీశాస్త్రిగారి గురించి విని, చదివి, తెలుసుకుని ఈనాటికి ఎందరమో వారిని స్మరిస్తూ నిత్యప్రేరణ పొందుతున్నాము. పొందుతూనే ఉంటాము. అలా మనందరి హృదిలోనూ వారు శాశ్వతులే!

విద్యార్థులుగా వచ్చిన వారికి కేవలం విద్యతో సరిపెట్టక వారిలో మంచిని నింపి పూర్ణమానవులుగ తీర్చిదిద్దేందుకు తపించేవారు. అలా ఎందరో వారిదరి చేరి శిష్యులుగా మలచబడ్డారని తెలుస్తుంది. ఆయా శిష్య గురుభక్తి, గురువుగారిని తలచుకున్నపుడు వారు పొందే తన్మయతను మనం స్వయంగా చూచినపుడు, వింటున్నపుడు మనలో కలిగే అనుభూతి అనిర్వచనీయం. తమ గురువుగారైన శ్రీశాస్త్రిగారు తమకు మానసిక, శారీరక, ఆధ్యాత్మిక సంపదలను ఎలా పంచినదీ, తమ జీవితాలను ఎలా పరిపూర్ణం చేసిందీ వారు తన్మయులై చెప్తుంటే మనకు వింతగాను ఇక్కడదికాని మరొక అందమైన ఆనందమయమైన దివ్యలోకాన్ని చూస్తున్నట్లు తోస్తుంది. వారి గురించి చదివినా, వింటున్నా, తెలుసుకుంటున్నా అదే అనుభూతి సదా అందుతుంది. అది వారి నిరంతర వాత్సల్యానికి ప్రతీక. వారు గురువుగా మార్గదర్శకం చేస్తూనే శిష్యులతో ఎంతో స్నేహపూరితంగా వ్యవహరించేవారట. తనకు సమ్మతంగా తోచనిదానిని నిష్కర్షగా చెప్తూనే అందరిపట్ల వాత్సల్యసౌరభాన్ని సదా వెదజల్లటం జరిగేదట. ఒక సమరసభావన ఆయననుండి సదా వెదజల్లబడుటంతో చుట్టూ ఉన్నవారు యోగోత్సాహంతో ఉరకలు వేసేవారట. వారు యోగప్రభావంతో తమ శారీరక మానసిక లోటుపాట్లను తొలగించి, జీవితాలను ప్రక్షాళణ చేసి పరహితులుగా తీర్చిదిద్దారని ఆయా శిష్యులు సవినయులై పొంగిపోతూ చెప్పటం విన్నాం. శ్రీరామకోటయ్య తాతగారు, శ్రీఉదయగిరి శ్రీనివాసాచార్యులవారు, శ్రీపోచిరాజు శేషగిరిరావుగారు, శ్రీసింగరాజు సచ్చిదానందంగారు, శ్రీతిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు, శ్రీమతి కల్పవల్లిగారు, శ్రీమతి చంద్రకాంతమ్మగారు మొదలైన వారు శ్రీశాస్త్రిగారి యోగశిష్యులలో ప్రముఖమైనవారు.

తన చుట్టూ ఉన్నవారికి కలిగే క్షేమమే తనక్షేమమని గ్రహించగలగటంలోనే మన యోగ్యత అంతా ఇమిడి ఉంది. ఈ భావాన్ని లోతుగా తరచిచూస్తే తనకు, చుట్టూ ఉండే ఇతరులకు భేదం లేదనిపిస్తుంది. భేదం ఉందనుకోవటంలోనే బాధలున్నాయి. పృథగ్భావమే ప్రమాదహేతువు - ఇది శ్రీశాస్త్రిగారు వారి అంతేవాసులకిచ్చిన సందేశం.

# ప్రజ్ఞా ప్రభాకరుడు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు

**- టి.యస్. శాస్త్రి,**

సత్యయోగాశ్రమం, హైదరాబాదు.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గురువరేణ్యులు 1916 జూన్ 22వ తారీకు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపులైన మాష్టరు సి.వి.వి. గారి వద్ద ఉపదేశము పొందినారు. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు జగమెరిగిన సాహితీవేత్త, సాహిత్యాభిమాను లెల్లరచే నిత్య ప్రశంశనీయులు. కానీ శాస్త్రి గారు మహా తపస్సంపన్నులుగా మాష్టరు సి.వి.వి. యోగ మార్గీయులు మాత్రమే ఎరుగుదురు. కావున వారి యోగ జీవిత విషేషములను సంక్షిప్తముగా తెలుసు కొనెదము.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సర్వజిత్ నామ సంవత్సరం మాఘ బహుళ ఏకాదశి శని వారం జెష్టా నక్షత్రము 4వ పాదంలో క్రీ.శ. ఫిబ్రవరి 7 వ తారీకు 1888 సంవత్సరం కృష్ణా తీరం పెదకళ్ళేపల్లి గ్రామంలో శ్రీ వేటూరి సుందర శాస్త్రి, శేషమ్మ దంపతులకు జన్మించారు. శ్రీ సుందరశాస్త్రి గారు స్మార్త, వైదిక, జ్యోతిష, శిల్ప సంస్కృత సాహిత్యముల నేర్చిన వారు. వైద్య విద్యా విశారదులు. ఆంధ్రభాషా సాహిత్యమున కవితా పరిజ్ఞానము గలవారు. తమ కుమారుని శ్రీ అద్దేపల్లి సోమనాథ శాస్త్రులు వారికడ మరియు చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి గారి వద్ద శిష్యత్వము గావింపచేసి సంస్కృతాంధ్ర భాషా పాండిత్య పారంగతునిగా చేసిరి.

శ్రీ శాస్త్రి గారు 18 ఏండ్ల ప్రాయం నుండే మద్రాసులో మిషను పాఠశాలలో పండిత పదవి ఆ తరువాత మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో పనిచేసిరి. ఆ సమయము ననే పిసుపాటి వారి ఆడబడుచు మహాలక్ష్మమ్మ గారితో వివాహము జరిగినది. మద్రాసులో పనిచేస్తున్న రోజులలో (1912-16) నడుమ తీవ్ర అనారోగ్యమునకు లోనై ఎన్నో వైద్యములు చేయించు కొన్నను ఆరోగ్య భాగ్యము కలుగక నిరాశా నిస్పృహలతో శారీరకంగా మానసికంగా క్రుంగిపోయి ఒక దుర్భర క్షణములో, ఏ హరిద్వారమునకో పోయి ప్రాణ త్యాగము చేయు సంకల్పము కలిగి యున్న తరుణంలో వారి మాటలలో "రోడ్డు మీద అబ్బూరి జగన్నాధరావు గారను మిత్రుడగుపడి నాచేయి పట్టుకొని మీరు ప్రభాకర శాస్త్రి గారేనా? ఇట్టుంటి రేమీ? యని అడిగెను. మూడేళ్ళ నుండి జబ్బుగానుంటి నంటిని, ఏమి జబ్బు అనుచు నాతడు నన్నింటి లోనికి గొనిపోయెను, శూన్య హృదయముతో నేను లోని కరగితిని." వారు వారి బావగారైన శ్రీ పోతరాజు నరసింహం గారి ద్వారా నచ్చ చెప్పి కుంభకోణమునకు ప్రయాణము చేయించిరి). అప్పటికే శ్రీ పి.యన్.గారు

మాష్టరు సి.వి.వి గారి డైరెక్టు మీడియం (శ్రీ శాస్త్రిగారు కుంభకోణం చేరి మొదటి సారిగా మాష్టరు సి.వి.వి గారిని దర్శించిన రూపము వారి మాటలలో "లావుగాక, సన్నముగాక, పొట్టిగాక మరీ పొడుగుగాక, నిమ్మపండు వంటి ఛాయతో, అరుణోదయ కాంతులు కడల్పోల్పుచున్న, శ్రీవారిని చూడగానే నాయొడలు పులకరించెను కేలుదోయిమోడ్చి నమస్కరించితిని" (మాష్టరు సి.వి.వి గారి రూప వర్ణన ప్రత్యక్షముగా చూచి వ్రాసి మన కందించిన వారు వీరొక్కరే (శ్రీ శాస్త్రిగారు 22వ తారీకు 1916 సాయంత్రము 6 గంటలకు ఉపదేశము పొందినారు. ఆ సమయమున మాష్టరు గారు ఇచ్చిన సూచన "నీవు హాలులోనికి వెళ్ళి ప్రేతాసనమున శయనించి, నమస్కరించి ఉపదిష్టము ఒక్క మారే ఉచ్చరించి కనులు మూసి కొని, శరీరము లోతట్టున నేమేని జరుగును కనుక దానిని గుర్తించు చుండుము, మనస్సు బహిర్ముఖమై యెక్కడికేని పోయినచో పోనిమ్ము, నీవై యరికట్టవలదు, అదే తిరిగి రాగలదు, ఏమి జరుగునో సాక్షీమాత్రుడవై పరికింప దలపు కొనుము.

ఆ రోజు శాస్త్రిగారికి కలిగిన అనుభూతి వారి మాటలలో, "నాలో ఏదో ప్రజ్ఞ ప్రవేశించి యూగించి వైచుచున్నట్లు గోచరించ దొడగెను. ఉత్సాహ వినోదముతో దానినే పరిశీలించు దొడంగితిని, 'ప్రజ్ఞ' యనియో 'శక్తి' యనియో ఇంకేమియో నిర్దేశింప దగిన యపూర్వానుభూతి ప్రవేశము నాలో విజృంభింప దొడగెను, అది ఎక్కడ నారంభించినది, ఏమి జరుపు చున్నదని వెదక దొడగితిని. నా శరీరం లోతట్టు దాకా వ్యాపించు చున్నట్లు తొలుత నెక్కడ నుపక్రమించినదో గుర్తుపట్ట సాధ్యము కానట్టుండెను. శరీరములో నేదో గొప్ప క్రొత్త ఇంజన్ పనిచేయుచున్నట్లయ్యెను. నా మనస్సానందోత్సాహములతో నలలు వారు చుండెను". అని వ్రాసుకొన్నారు. "నేను శ్రీవారి సన్నిధి కేగి జరిగిన దంతయు చెప్పితిని. ఆ తరువాత రోజు స్వామివారితో (మాష్టరు గారితో) స్వామి! చాలాకాలం నుండి మందులకు లొంగని వ్యాధి ఇప్పుడిప్పుడే కుదుట పడుచున్నది. కావున నేనిక్కడనే మీ సేవకుడుగా వుండ గోరుచున్నాను అనుగ్రహింపుడని" అడిగినారట.

మాష్టరు గారు నీవు ఇక్కడ వుండ వలసిన అవసరం లేదు, నీవు తిరిగి వెళ్ళి నీ ఉద్యోగము చేసుకొనుచు నీ కుటుంబ పోషణకు భంగము కలుగనియ్యక మీ ఇంటి వద్దనే సాధన కొనసాగించ గలవు "సదా నీలో నుండును నీకు కావలసిన సహాయము నీలో నుండి జరుపు చుందును" అని చెప్పడం జరిగింది మరియు ఈ విధానంలో జరిగే చర్యలు గురించి వివరంగా మాష్టరు గారు చెప్పిన మీదట వారు తిరిగి మద్రాసు వచ్చి శ్రద్ధగా సాధన చేస్తూ ఉద్యోగ బాధ్యత నిర్వహించి నారట. ఆ రోజున శాస్త్రిగారికి ఇచ్చిన సూచనలు వారి డైరీలో వ్రాసుకొన్నారు. అవి ఈ నాటి సాధకులకు ఎంతో మార్గదర్శకంగా సాధనకు ఉపయుక్తముగా ఉన్నవి.

ఆ తరువాత రోజులలో వీలు దొరికినప్పుడల్లా కుంభకోణం వెళ్ళి స్వామివారి వద్ద తమ సందేహాలను తీర్చుకొని రెండుమూడు రోజులు యోగా స్కూలులో ప్రార్థన చేసుకొని వచ్చే వారు. 1916 డిశంబర్ నెలలో శాస్త్రి గారికి తంజావూర్ లైబ్రరీలో ప్రత్యేక విధి నిర్వహణకై బదిలీ చేయడం జరిగినది. తంజావూరు కుంభకోణం దగ్గరవడం మూలాన తరచూ వచ్చి ప్రార్థన చేసుకొని స్వామివారిని కలసి సాధనకు కావలసిన సూచనలు పొందడం జరిగినది. ఒక పర్యాయం శాస్త్రిగారు! స్వామి దివ్యానుగ్రహమున నేను ఆరోగ్య వంతుడనైతిని. నాకు ఈ యోగమార్గము వలన ధన్యత చేకూరినది. నాకు శరీరం ఇచ్చిన నా తల్లిదండ్రులు వృద్ధులైనారు, వారికి ఎప్పుడు ఏమి జరుగునో తెలియదు, కనుక వారికి మీరు శిష్యానుగ్రహ మొసగి వారిని కూడా ధన్యుల చేయమని అడిగినారట. మాష్టరు గారు నవ్వి వార్థక్యమున వున్న నీ తల్లి తండ్రి గురించి ఏల చింతించెదవు, "నీవు యోగ సిద్ధుడవైతివేని నీ యోగ వాసనలంటి నీ వంశజులెల్ల కడతేర గలరు," కనుక నీతో చిరకాలము సాహచర్యము చేయవలసిన, నీ అర్థాంగి గురించి అలోచించు, ఈ రోజు నీ శ్రీమతికి ఉపదేశార్హత కలుగ చేస్తాను అని అడుగకయే శ్రీమతి మహాలక్ష్మమ్మ గారికి మీ.నెం. 516గా 17.4.1917 రోజున యిన్సియేషన్ చేసినారట వారెంత భాగ్య శాలియో కదా!

ఆనాటి నుండి భార్యా భర్తలు ఇరువురు కలసి అత్యంత శ్రద్ధతో సాధన కొనసాగించడం జరిగినది. మాష్టరు సి.వి.వి. గారి భౌతిక దేహ త్యాగానంతరం శ్రీ శాస్త్రి గారు 1939 లో మద్రాసు ప్రభుత్వోద్యోగమునకు ఐచ్ఛిక విరమణ తీసుకొని, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో తెలుగు పండితులై తిరుపతికి తమ మకాం మార్చడం జరిగినది. 1944 లో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయమున ఆంధ్ర శాఖాధ్యక్షులై 1950 వరకు తమ ఆధ్యాత్మిక యోగ జీవనం, సాహిత్య వాఙ్మయ జీవనం కొనసాగించడం జరిగినది. ఈ సమయముననే యోగ జిజ్ఞాసులైన అనుయాయులను చేరదీసి మాష్టరు గారి యోగ విధానమున సుశిక్షితుల చేయడం జరిగినది. వారిలో శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారు, శ్రీ కొత్త రామకోటయ్యగారు ప్రముఖులు. శ్రీ శాస్త్రిగారు మాష్టరు సి.వి.వి గారి దివ్యానుగ్రహముతో యోగ విధానమున పొందిన ఆరోగ్య నిధిని కొన్ని వందల మందికి పంచి పెట్టి అవ్యాజ ప్రేమ చూపిన మహాత్ముడు. వారి అడుగు జాడలలోనే శ్రీ శ్రీనివాసా చార్యులు గారు శ్రీ రామకోటయ్య తాతగారు కూడా గుర్వనుగ్రహము ద్వారా యోగ శక్తిని పంచి ఆరోగ్య ప్రదాతలైరి. శ్రీ శాస్త్రిగారి యోగ పుత్రిక శ్రీమతి చాగంటి కల్పవల్లిగారు. వారి నాన్న గారిని అడుగు జాడలలో వారి జీవితాంతము యోగ సాధనతో బాటు ఆరోగ్య ప్రదాతలై శ్రీ శాస్త్రిగారి కీర్తి ప్రతిష్ఠను ఇనుమడింప చేయడం జరిగినది. ఈనాడు శ్రీ శాస్త్రిగారి అనుయాయులు కొన్ని వందల మంది ఆంధ్రదేశమున అత్యంత శ్రద్ధతో సాధన సాగిస్తున్నారు. శ్రీ శాస్త్రి గారు వారి జీవితాంతము మాష్టరు సి.వి.వి గారి సూచనలను

అనుసరిస్తూ తమతో పాటు అనేకమంది ఔత్సాహిక సాధకులకు మార్గ దర్శకులుగా, రోగార్తుల పాలిట కల్ప వృక్షమై నిరంతరానందము పొందిన ధన్య జీవులు. వారి మాటలలో యోగ మహిమ గురించి వ్రాసిన పద్యం.

**శ్రీ నిరంతరానంద నిక్రియ సార్ధ**
**సాధకము సర్వ కిల్బిష బాధకము,**
**సమగ్ర విజ్ఞానదము, మహోమహిమ ఘనము**
**శరణమగు మాకు సద్గురు చరణ యుగము.**

దీనిద్వారా మాష్టరు సి.వి.వి.గారి యోగ సాధన ద్వారా వారు **పొందిన** యోగ **అనుభూతి** అర్థమౌతుంది. యోగసాధకులు పొందగలుగు ప్రయోజనములకు **తనకు తానే సాక్షి అనే మాటలు ఒళ్ళు** పులకరింప చేస్తాయి. యోగ సాధన ద్వారా పొందదగు ఫలితములను, తెలుపుతూ, **అట్లు** పొందిన **వారికి** తార్కాణము తానేయని ప్రకటించుకొన్న ధన్యజీవులు.

**సీ.వీ.వీ కరుణా కటాక్షములు రక్షించున్ సదా తన్మయం**
**బై వర్ధిల్లెడు భక్తియున్న యెడ నిత్యానంద మారోగ్య మా**
**హో పుట్టించెడు ప్రజ్ఞ, యాత్రయము లభ్యంబౌను, తార్కాణ నే**
**నే! వేయేటికి? మీర లందరు దీనిం జక్క గుర్తింపరో!"**

ఇంతకన్న చెప్పదగిన దేమున్నది యోగ అనుభూతి గురించి, అట్టి తపోమూర్తికి, ప్రజా ప్రభాకరుడుగా, యోగ ప్రజ్ఞను అందరియందు వికసింప చేసిన మహాత్ములైన శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారికి నమస్సుమాంజలి సమర్పించు కొంటున్నాము. వీరి స్వీయ రచనలు ప్రజ్ఞా ప్రభాకరం, యోగప్రభ, ప్రజ్ఞా వికాసము, చదివి వీరి సమగ్ర చరిత్ర తెలిసికొని అనుసరించగలరు.

మాష్టరు సి.వి.వి. నమస్కారము.

* * *

# భృక్త రహిత రాజ యోగి - వేటూరి ప్రభాకర శాస్త్రి గారు

- గౌరి నాయుడు

వేటూరి ప్రభాకర శాస్త్రి గారు అంటే సాహిత్య మేరు పర్వతం. ఆయన రాయని పీఠిక లేదు. తరచని సాహిత్యమూ లేదు. తిరగేయని శాసనం, సేకరించని తాళ పత్రం లేదు. దేశభక్తిలో అనుపమాన మైన వారు. ఇవన్నీ మనకు అందరికి తెలిసిన విశేషాలే కాని అందరికి తెలియని మహా పార్శ్వం వేటూరి వారిలో ఉంది. వారు మాస్టర్ సి.వి.వి.గారి శిష్యులై ఎంతో యోగ సాధన చేసి ఆధ్యాత్మిక తీరాలను చూసి, తన వంటి వారెందరినో శిష్యులను తయారు చేసి దీనులను ఉద్ధరించారు. అదే మనం తెలుసుకోబోతున్నాం.

కృష్ణా జిల్లాలో దివి తాలూకా చల్లపల్లికి సమీపంలో పెద్దకళ్ళేపల్లిలో ప్రభాకర శాస్త్రి గారు 7-2-1888న వేటూరి శేషమ్మ, సుందర శాస్త్రీ దంపతులకు జన్మించారు. పదహారేళ్ళకే తెలుగు, సంస్కృతం పుక్కిట పట్టారు. కవిత్వమూ చక్కగా అలవడింది. శతావధాన, అష్టావధానాలెన్నో చేశారు. మద్రాసులో తెలుగు పండితులుగా పని చేశారు. అప్పుడే వేపా రామేశం గారి వద్ద ఖగోళం, చరిత్ర అధ్యయనం చేశారు. 1910 లో పిసుపాటి మహాలక్ష్మమ్మ గారితో వివాహమైంది. మద్రాస్ ప్రాచ్య లిఖిత భాండాగారంలో పండితునిగా చేరి ఇంగ్లీషు, కన్నడ, తమిళాలు నేర్చారు. చరిత్ర సంస్కృతి, వాఙ్మయం, శాసనాలు తాళ పత్రాలు, కైఫీయత్తులు, గ్రంథాలు సేకరించి, పరిశీలించి పరిష్కరించి, ముద్రించారు." ఎన్నో బండ్లకు ఎత్త దగినంత సాహిత్య వాఙ్మయాన్ని శాస్త్రి గారు సంతరించారు అని ఆయన్ను గురించి అంటారు.

## యోగసాధన

1912-16 మద్య కాలంలో శాస్త్రి గారు తీవ్ర బాధలకు గురైనారు. మానసిక స్వాస్థ్యమూ కోల్పోయారు. మద్రాసులో రైలు ఎక్కి ఎక్కడో ఆత్మహత్య చేసుకోవాలని భావించి రైలు ఎక్కటానికి స్టేషన్ కు పోతున్నారు. అబ్బూరి జగన్నాథ రావు అనే వారితో పరిచయమైంది. ఆయన తన బావ గారైన ప్రేసిడెన్సికళాశాల ఫిలాసఫీ ప్రొఫెసర్ పోతరాజు నరసింహం గారిని పరిచయం చేశారు. ఈయన మాస్టర్ సి.వి.వి.గారి శిష్యులు. పోత రాజు గారు ఇచ్చిన పరిచయ ఉత్తరాన్ని తీసుకొని వేటూరి వారు కుంభకోణంలో ఉన్న మాస్టర్ గారింటికి చేరి ఉత్తరం ఇచ్చారు. ఆయన చదివి విశ్రాంతి తీసుకోమని సలహా ఇచ్చారు. ఆ మాట తోనే శాస్త్రి గారిలో 'ప్రజ్ఞ' ప్రవేశించింది. అప్పటికి ఆయన చేతిగూడు జారి చాలాకాలం నుంచి చాలా బాధ పడుతున్నారు. ఇక్కడికి రాగానే తగ్గి పోయి గూడు మళ్ళీ యథాస్థానం చేరింది. ఒక చెయ్యి

పైకి లేప గలిగే వారు కాదు. ఇప్పుడు హాయిగా చెయ్యి పనిచేస్తోంది. మాస్టర్ గారి అనుమతితో రాధాకృష్ణ పిల్లే, మహాదేవ్య గార్లు శాస్త్రి గారిని పరీక్షించి పూర్వజన్మ వృత్తాంతం తెలుసుకొని మాస్టర్ గారికి నివేదించారు. అప్పటి నుంచి శాస్త్రి గారు మాస్టర్ గారి శిష్యులైపోయారు .

ఇతరుల బాధలను చూసి శాస్త్రి గారు తట్టుకోలేకపోయేవారు తన ఆత్మ శక్తితో బాధలు తీర్చే వారు నిన్నటి వరకు నువ్వు ప్రజ్ఞా ప్రభాకరుడివి. ఈ రోజు నుండి నన్ను గురించి రాయ గల యోగ్యత నీకు కల్గింది అని గురువు గారు శాస్త్రి గారిని మెచ్చారు. 1918 లో తంజావూర్ సరస్వతి గ్రంథాలయంలో పనిచేశారు. వారాంతపు శెలవుల్లో మాస్టర్ గారిని దర్శించి యోగ రహస్యాలు నేర్చే వారు. శాస్త్రి గారు తమ లో సమస్త విశ్వాన్ని, సమస్త విశ్వంలో తమను దర్శించ గల యోగి పుంగవులు అయ్యారు. భార్యను కూడా మాస్టార్ జీ కి శిష్యురాలిని చేశారు. అందుకే ఆయనలో కరుణ, దయ, ప్రేమ, శాంత గంభీరత స్పష్టం గా కన్పిస్తాయి .ఆయన ముఖం చూస్తేనే చాలు మానసిక ప్రశాంతత లభిస్తుందని చాలా మంది చెప్పే వారు.

## యోగప్రభాకరామృతం

ఒక రిక్షాలాగే వాడి కొడుకు నోట మాట రాక మూతి వంకరపోయి చేతులు, కాళ్ళు స్వాధీనంలో లేక శాస్త్రి గారి దగ్గరకు వస్తే, ధ్యానం చేసి వాడితో కాఫీ తాగించి శరీరం అంతా నిమిరి ప్రేమ కురిపించారు. అంతే వాడు తనకేజబ్బు లేనట్లు లేచి కూర్చున్నాడు.

బందరు లోని వేమూరి దుర్గా నాగేశ్వర రావుకు రెండు కిడ్నీలలో రాళ్ళు చేరి ఎన్ని మందులు తిన్నా తగ్గక వేటూరి వారి వద్దకు చేరాడు. డాక్టర్లు అది తగ్గే జబ్బు కాదని హేళన చేశారు. ఒక సారి తీవ్రంగా బాధ అనుభవిస్తూ శాస్త్రి గారికి కబురు చేస్తే, తాను అక్కడి నుండే చికిత్స చేస్తున్నానని భయం లేదని చెప్పారు. కాసేపటికి మూత్రం ద్వారా రాళ్ళు పడిపోయి బాధ నివారణ జరిగింది. ఆలస్యం ఎందుకు జరిగింది అని ఆయన వేటూరి వారిని ప్రశ్నిస్తే నమ్మకం నీకు పూర్తిగా లేనందువల్ల అని చెప్పారు.

ఒక సారి శాస్త్రి గారు అయాచితుల హనుమచ్ఛాస్త్రి, అప్పల సోమేశ్వర శర్మలతో 'భృక్త రహిత రాజ యోగం' గురించి, మాస్టర్ గారి గురించి మాట్లాడు కొంటున్నారు. వారిద్దరూ ఈ యోగా మాహాత్మ్యానికి ఏదైనా నిదర్శనం చూపమని అడిగారు. మీకు యే పువ్వు ఇష్టమో చెప్పండి అన్నారు శాస్త్రి గారు. సంపంగి అన్నారు వారిద్దరూ. వేటూరి వారు ధ్యానంలో మునిగి పోయారు. వెంటనే వాళ్ళున్న ప్రదేశమంతా సంపంగి పూల వాసనలు గుబాళించాయి. కాలం కాని కాలంలో సంపంగి పూల వాసన రావటం అందర్నీ ఆశ్చర్యం లోకి నెట్టేసింది. ఇదే ఆ యోగానికి నిదర్శనం.

కల్లూరి వీర భద్ర శాస్త్రి వేటూరి వారిని దర్శించటానికి మద్రాసు వెళ్లారు. అక్కడ 'కూం' నది మురికి కంపు భరించ లేకుండా ఉంది. వీరభద్రం గారు, "శాస్త్రీ! ఈ కంపు పోగొట్టవా" అని మనసులో అనుకొన్నారు. అంతే శాస్త్రి గారు కళ్ళు మూసుకొని ధ్యానిస్తే సుగంధ పరిమళాలు అంతటా వ్యాపించాయి. ఇంకో సారి 'అనాస పండు' తినాలని పించింది. కాసేపటిలో ఆయన దర్శనం కోసం రాజమండ్రి నుంచి అప్పుడే వచ్చిన పద్మనాభ స్వామి అనే సాధకుడు అనాస పండ్ల గంపతో వచ్చి ఇచ్చాడు.

ప్రఖ్యాత శాస్త్ర వేత్త విస్సా అప్పారావు వేటూరి వారికి వియ్యంకులు. అప్పారావు గారు శాస్త్రి గారి యోగాద్భుతాలు 31 ని గ్రంధస్తం చేశారు. అందులో ఒకటి కుష్ఠ రోగంతో బాధపడుతున్న వకీలు గుమాస్తాకు తన ఇంటి వద్దనుంచే నయం చేశారు. తిరుపతిలో ఉండే నరసింహాచారికి, ఒక రెడ్ల కుర్రాడికి మద్రాసు నుండే కుష్ఠ రోగం కు చికిత్స చేసి పోగొట్టారు. దీన్నే డి స్టంట్ హీలింగ్ అంటారు. తిరుపతి లోని పార్థసారథి అయ్యంగార్ భార్యకు గర్భకోశ కేన్సర్, డాక్టర్లు ఆమె పని రోజుల్లోనే ఉందన్నారు. శాస్త్రి గారు ఆయన కోరితే వాళ్ళింటికి వెళ్లి ప్రార్థన చేశారు. నలుపు, ఎరుపు ద్రవం బయటికి పోయి పదిహేను రోజుల్లో ఆమె మామూలు మనిషి అయింది.

1939-40 ప్రాంతంలో ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారికి నిద్ర రాక పోవటం గుండె దడ, వీధిలో నడవటానికి భయం ఉండేవి. శాస్త్రి గారిని సంప్రదించారు అదేదో ఆయన సూక్ష్మ శరీరంలోని బాధ అని తెలుసు కొన్నారు. అది అవధాని గారి మొదటి భార్యదే ఎంతగా ట్రీట్ చేసినా తగ్గలేదు. అవధాని గారికి ఒక సారి 'నువ్వు నా మాట వినక పోతే వినేట్లు చేస్తాను' అని గట్టిగా మందలించారు. వారి ఆదేశం ప్రకారం అవధాని గారి రెండో భార్యకు మొదటి భార్య మొదటి సంతానంగా పుట్టి ఋణం తీర్చుకోంది. అప్పటి నుండి అవధాని గారికి యే బాధలు లేవు. అలాగే కుప్పుస్వామి శాస్త్రిగారి మొదటి భార్య చనిపోయి ఆయన్ను చాలా బాధ పెడితే వేటూరి వారు ఆమెను ఆయన కొడుకు శేషగిరికి కూతురుగా పుట్టమని చెప్పారు. అలానే జరిగితే ఆయనకు ఆనందం కలిగింది.

ప్రఖ్యాత దేశ భక్తులు, మహా వక్త చెరుకువాడ నరసింహం పంతులు గారికి క్షయ వ్యాధి చాలా తీవ్రంగా వచ్చింది. దాన్ని ట్రీట్ చేసి నయం చేశారు శాస్త్రి గారు. అలానే ప్రముఖ సంపాదకుడు నార్ల వెంకటేశ్వర రావు భార్యకు పార్శ్వపు నొప్పి, తిరుపతి ప్రాచ్య శోధన సంస్థ సంచాలకుడు రామానుజ స్వామి భార్యకు జలోదరం తగ్గించారు.

నా చుట్టూ ఆనందాన్ని, అమృతాన్ని పంచి పెట్టాలనే సంకల్పం ఉన్న వాణ్ని నేను అందర్ని ఆపదల నుంచి రక్షించటం, అందర్లో ఆనందాన్ని నెలకొల్పటం అనే రెండు భావాలే నాకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు.

అవి రెండు ఆడటంలోనే నా ఊపిరి అన్న మహానుభావులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. నిజంగానే ఆయన ప్రభాకరుడు అంటే సూర్యుడు లానే ఆరోగ్యాన్నిచ్చేవారు. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" కాదు, ఆరోగ్యం ప్రభాకరాదిచ్ఛేత్ అయింది. ఆయన పట్ల సార్థక జీవులు వారు.

ఒక సారి వారు తాళపత్రాల కోసం ఊళ్లు తిరుగుతూ ఒక వూరిలో ఉండగా నిద్ర పట్టక బయట తిరుగుతూ, దీపం వెలుగుతున్న ఇంటికి పోయి మంచి నీళ్ళు అడిగారు. గృహిణి మంచినీళ్ళ చెంబు అందించి, తన భర్త ప్రాణాపాయ స్థితిలో ఉన్నారని దీనంగా విలపించింది. అంతే కరుణార్ద్ర హృదయులు శాస్త్రి గారు మంచి నీళ్ళు తాగకుండా తన బసకు చేరి కాళ్ళు కడుక్కొని నిద్ర పోకుండా ప్రార్థన చేశారు. తెల్లారి వెళ్లి ఆమెను పలకరించారు. 'మీరు పలకరించి వెళ్ళిన తర్వాత మా వారికి ఆరోగ్యం కుదుట బడింది' అని కృతజ్ఞత చెప్పింది ఆ ఇల్లాలు. ప్రార్థనకు, ఈశ్వర అనుగ్రహానికి ఉన్న మహత్తర శక్తి ఇక్కడ మనకు కన్పిస్తుంది. ఆయన అనుకంపనం అలాంటిది. అందుకే ఆయన బుద్ధుని అపర అవతారం అన్నారు. యోగ ప్రభాకరులు 29-8-1950న తమ హంసను సవితృమండల నారాయణమూర్తి లోనికి చేర్చి ధన్యులయారు. వారికి దేశం అన్ని విధాలా ఎంతో ఋణపడి ఉంది.

**యోగ ప్రభాకర కిరణాలు**

ప్రభాకర శాస్త్రి గారి యోగ శిష్యులలో కొత్త వెంకటేశ్వర రావు, కొత్త రామ కోటయ్య, అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులు, ఎం.ఎల్.నారాయణ రావు, వెన్నెల కంటి ముని క్రిష్ణయ్య, గాలి బాల సుందర రావు, తిమ్మావజ్ఝుల కోదండ రామయ్య, సింగరాజు సచ్చిదానందం, పోచిరాజు శేషగిరిరావు, శ్రీమతి కల్పవల్లి, శ్రీమతి చంద్రకాంతమ్మ మొదలైన వారెందరో ఉన్నారు.

* * *

## గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు - "వారి వెలుగు"

**- పోతరాజు యోగానంద్**

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి గురించి వ్రాయటం అంటే ఒక సాహసం చెయ్యటం లాంటిది. వారి గురించి వ్రాయటం అంటే మధ్యాహ్నపు సూర్యుని కాంతి గురించి వ్రాయటం. అంతటి శక్తిశాలి, ప్రేమ స్వరూపుని గురించి ఒక వ్యాసం రాసి పంపమని శ్రీ ప్రభాకర్ గారు (Son of Smt. వినతమ్మగారు D/o శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు) అడిగినపుడు, అది గురుదేవుల ఆజ్ఞగా భావించి, వ్రాయించే వారు కూడా గురుదేవులే అని తలచి, వ్రాయటం మొదలుపెట్టాను.

గురుదేవులు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి గురించి, వారి జీవిత చరిత్ర గురించి, యోగ విషయాల గురించి తెలియని వారు M.CVV యోగ మార్గములో ఉండరు. కాని వారి వెలుగు వారి తరువాత, వారి శిష్యుల తరువాత వారి ప్రశిష్యుల తరువాత కూడా ప్రసరించుతూ, అది నా దాకా వచ్చినట్లు అనుభూతి కలుగుతోంది. ఒక సభలో వారి తనయులు శ్రీ ఆనందమూర్తిగారు మాట్లాడుతూ, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యోగ కుటుంబం ఎంత పెద్దదో చెప్పారు. అందులో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి కుటుంబ సభ్యులతో పాటు, తిరుపతిలోని యోగ మిత్రులు, చిన కాకానిలోని శ్రీ తాతగారి అనుచర బృందము, శ్రీమతి కల్పవల్లి అమ్మగారి యోగ అనుచరులతో పాటు నా గురువుగారు అయిన శ్రీ పాంచాలవరపు పురుషోత్తముగారు ఉండడం నాకు ఆనందాన్ని కలిగించినది. మా గురువు గారితో పాటు వారి శిష్య బృందము కూడా ఉంటుందని, అందులో నేను కూడా ఉన్నానని ఆనందించాను. ఇది నా పూర్వ జన్మ శుకృతంగా భావిస్తున్నాను.

శ్రీ గురుదేవులు ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణాజిల్లాలో చల్లపల్లి దగ్గర పెద్దకళ్ళేపల్లిలో జన్మించటం, బందరులో విద్యాభ్యాసము చెయ్యటం అందరికి తెలిసిన విషయం. వారు బండి మీద కరకట్ట మీదుగా "అవనిగడ్డ" వెళ్ళి చదివారనగానే నా ఒళ్ళు పులకరించింది. కారణం అవనిగడ్డలో నేను జన్మించటం, మా ఊరు దగ్గరలో వారు సంచరించిన విషయం తెలసి ఎంతో ఆనందించాను.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గురుదేవులు M.CVV గారిని కలసి వారి యోగ మార్గములో శ్రీవారితో సమానమయిన వెలుగును, శక్తిని అందిపుచ్చుకుని, దానిని ఆంధ్ర, తమిళదేశములలో మానవాళికి పంచిన విధము, ఆ వెలుగు అప్పటి నుంచి ఇప్పటి దాకా పనిచేయటం అనేది నా అనుభూతికి అందుతున్నది.

నన్ను వారి కుటుంబములో ఒకరిగా స్వీకరించారు అనటానికి, నన్ను శ్రీ కొత్తరామకోటయ్య తాతగారి కుటుంబానికి అనుసంధానము చేసి, చినకాకానిలో శ్రీ తాతగారి ఇంటివద్ద, ఆశ్రమం వద్ద, మంగళగిరిలో శ్రీ తాతగారిచే ప్రారంభించిన యోగ కార్యక్రమాలలో పాలుపంచుకోవటం ద్వారా హైదరాబాదులోని వారి అమ్మాయి శ్రీమతి సుజాతమ్మగారిచే నిర్వహించు యోగ కార్యక్రమాలలో పాలుపంచుకోవటం ద్వారా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వెలుగుతో నాకు అనుసంధానము అయినది అనుకుంటున్నాను.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గురుదేవుల తరువాత వారి కుటుంబ సభ్యులు అందరూ M.CVV యోగ మార్గములో సాధన చేయుచూ, వారి నాన్నగారి ద్వారా వారు అందుకున్న వెలుగును నిశ్శబ్దముగా, ప్రక్క వారికి పంచుతున్నారు. సమస్తమయిన శక్తి "M.CVV" అను 3 అక్షరాలలో ఉన్నదని, సాధనకు ఆ 3 అక్షరాలు చాలు అని తెలిపిన మహనీయులు వారు. ఈ రోజుకు వారి ప్రార్ధనల ద్వారా అనేకులకు ఆరోగ్యం ప్రసాదించుచూ, వారి నాన్నగారి కార్యక్రమాలను – యోగ కార్యక్రమాలను ఈ రోజుకు నిర్వహిస్తున్నారు.

ఈ ప్రపంచంలోని పవిత్ర ప్రేమకు ఒక రూపం ఇస్తే, అది శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గురుదేవులుగా దర్శనము ఇస్తుంది. మానవాళి పట్ల వారి ప్రేమ అటువంటిది. ఒకసారి కుష్ఠు మొదలగు వ్యాధులతో బాధ పడుతున్న వానిని ముట్టుకుని, ప్రేమతో ప్రార్ధన చేయగా అతనికి ఉపశమనం కలిగిందట. అలా చేస్తున్నప్పుడు, వారి శిష్యులలో ఒకరు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారితో ఇలా అన్నారట. ఈ విధంగా ఉన్న వారిని తాకితే మీరు మయిల పడతారేమో అని. అపుడు గురువు గారు ఇలా అన్నారట. అటువంటి వారిని తాకితే మనము మయిల పడటం కాదు, మనము పునీతులం అవుతామని, వారు సాక్షాత్తు M.CVV స్వరూపులు అని. దీనిని బట్టి వారిలో ఉన్న ప్రేమ అర్ధమవుతుంది. వారికి కుల, మతాలు లేవు, అంటరాని వారని ఎవరు లేరని అంటూ ఉండేవారట.

అలాగే వారికి అచంచలమయిన దేశభక్తి, శ్రీ గాంధీ గారి పట్ల అభిమానములకు అవధులు లేవు. శ్రీ గాంధీగారు నిరాహార దీక్ష చేస్తున్న రోజులలో వారి శిష్యులతో కలసి ప్రతిరోజు శ్రీ గాంధీగారికి శక్తికి ట్రాన్స్ఫర్ చేసేవారట. శ్రీ గురుదేవుల అనారోగ్యానికి ఒక కారణం దేశానికి స్వాతంత్ర్యము రావాలని వారు పడిన తపన అని కొందరు తెలిసిన వారు అంటారు.

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పంచిన "వెలుగు"లు కొన్ని ఇక్కడ ముచ్చటించు కోవటము, రాబోయే తరాల వారికి M.CVV యోగము పట్ల నమ్మకాన్ని కలిగిస్తూ, యోగము పట్ల ఆకర్షితులు అవుతారు అని.

శ్రీ పోతరాజు నరశింహం గారు పెద్ద వయసులో కాళ్ళకు నీరు పట్టి, మంచం మీద నుంచి సరిగా కదలలేని స్థితిలో ఒకసారి గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వెళ్ళి, వారితో కలసి M.CVV యోగ విషయాలు, సాధనల విషయాలు ముచ్చటిస్తూ కాలం తెలియకుండా 2/3 గం॥ గడిపారట. అపుడు శ్రీ పోతరాజు నరశింహంగారు, 4/5 సార్లు మూత్రవిసర్జనకు వెళ్ళిరావటం, తరువాత కాళ్ళలోని నీరు తగ్గటం, మంచం మీద పడుకున్న వారు లేచి కుర్చోవటం జరిగిందట. శ్రీ పోతరాజు నరశింహంగారి భార్య శ్రీమతి సత్యవతమ్మ గారు భోజనానికి పిలవగా, వారు ఇరువురు మేడ మెట్లు దిగి, క్రిందకు వచ్చి భోజనం చేసారని, ఇది చూచి శ్రీమతి సత్యవతమ్మగారు ఆనందించారని పెద్దలు చెప్పగా విని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి "వెలుగు" అర్థమయ్యింది.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శిష్యులలో ఒకరయిన డా॥ గాలి బాలసుందరం గారి భార్యకు అనారోగ్యంతో ఆఖరు దశకు చేరారని, చివరి ప్రయాణంకు కావలసిన ఏర్పాట్లు కూడా చేస్తున్న సమయంలో డా॥ గాలి బాలసుందరం గారు గురువుగారికి ఈ విషయం తెలియజేస్తూ ఒక Express, Reply Telegram ఇచ్చారట " Wife Seriously ill, Adivse" అని. అపుడు గురుదేవులు "Give her a cup of coffee, she will be all right" అని వెంటనే వారు ఒక కప్పు కాఫీ తెచ్చి, భార్య చెవిలో శ్రీ గురువు గారు కాఫీ తాగమన్నారని, నీకు ఆరోగ్యం వస్తుందని అన్నారని, ఒక చెంచాడు కాఫీని భార్య నోట్లో పోసారట. 2వ చెంచాకు వారు నోరు తెరచి, నిద్ర నుంచి లేచినట్లు లేచి, డాక్టర్ చేతిలోని కాఫీ కప్పు తీసుకు తాగారట. ఇది చూచిన వారందరు ఆశ్చర్యపోయారట. ఈ విధంగా శ్రీ గురువుగారు దూరం నుంచి కూడు "వెలుగును" పంచారు.

అలాగ శ్రీవారు(శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి) శ్రీ కొత్త రామకోటయ్య తాతగారికి ఆరోగ్యం ప్రసాదించారు. మద్రాసు ఆసుపత్రిలో అనారోగ్యంతో చేరిన శ్రీ తాతగారి ఆరోగ్య పరిస్థితి బాగాలేదని, ఆఖరు ఘడియలు అని, వారు సర్టిఫికెట్ ఇచ్చి, ఇంటికి తీసుకువెళ్ళండి, ఈయన ఒక వారం కూడా బ్రతకలేరని అన్నారట. వారి సోదరులు శ్రీ కొత్త వెంకటేశ్వరరావు గారి ద్వారా శ్రీ గురువు గారి వద్దకు చేరి, వారు పంచిన ప్రాణ శక్తితో పూర్తిగా కోలుకుని, తిరిగి ఇంటికి చేరారు.

చిన్న వయసులోనే "మెదడువాపు" వ్యాధితో డాక్టర్లు ఇక బ్రతకదు అని చెప్పిన మీదట, శ్రీమతి చాగంటి కల్పవల్లిగారు, వారి తండ్రిగారి సహాయముతో శ్రీ గురువు గారి వద్దకు చేరి, ప్రార్థనలో పాల్గొనిన తరువాత బిగుసుకుపోయిన వారిలో కదలికలు వచ్చి, మరికొంత సేపటికి మామూలు మనిషి అయ్యారట. అప్పటి నుంచి శ్రీమతి చాగంటి కల్పవల్లి గారు శ్రీ గురుదేవుల ఇంట్లోనే ఉంటూ శ్రీ గురువు గారిని "నాన్న గారు" అని పిలుస్తూ, శ్రీ గురువు గారి కుమార్తెగా పెరిగి పెద్దవారయి వివాహము, సంతానము కలిగి M.CVV యోగ సాధనలో వారి కుటుంబము మొత్తము తరించారు.

# విజ్ఞాన వటవృక్షము : వేటూరి

- మాశర్మ

ప్రజ్ఞాప్రభాకరుడిగా తెలుగునాట కోటి వెలుగులు వెదజల్లిన మహోన్నతమూర్తి వేటూరి ప్రభాకరశాస్త్రి. వీరిది కవి, పండితుల కుటుంబం. సాహిత్యం , సంగీతం, వైద్యం వేటూరివారి ఇంట్లో, ఒంట్లో ప్రకాశమానమై కోటి ప్రభలుగా ప్రభవించాయి. పన్నెండవ ఏటనే పద్యములల్లిన పుట్టుకవి. పండితుడు, కవి, పరిశోధకుడు, పరిష్కర్త, చరిత్రకారుడు, విమర్శకుడు, నాటక రచయిత. వీటన్నింటిని మించి గొప్ప యోగ సాధకుడు. అటు సాహిత్యంలోనూ, ఇటు యోగాభ్యాసంలోనూ ఎందరికో గురువు, గురువులకే గురువు వేటూరి. జీవించింది ఆరుపదుల కాలమే అయినా, అనంతకాలంలో నిలిచిపోయే అద్భుతమైన కృషి చేసిన ఆంధ్రతేజం. ఆయన ముట్టని కొమ్మలేదు, పట్టిన ప్రతి కొమ్మకు చేవను అందించిన ధీశాలి. సంస్కరణా శీలి. వేటూరి ప్రభాకరశాస్త్రి అనగానే అన్నమయ్య, జాను తెనుగు, చాటువులు గుర్తుకువచ్చి తీరుతాయి. ఎన్నో మహా గ్రంథాలను వెలికితీసి, పరిష్కరించి, ప్రపంచానికి అందించిన పుణ్యజీవి. ఈరోజు అన్నమయ్య గురించి మనం మాట్లాడుకుంటున్నామంటే, ఆ కీర్తనలు వింటున్నామంటే, పాడుకుంటున్నామంటే.. అదంతా ప్రభాకరశాస్త్రి చలువే. ఈ లోకం అన్నమయ్యను దాదాపు 400ఏళ్ళపాటు మరచిపోయింది. ఆ సాహిత్యం మన స్మృతి పథం నుంచి వెళ్ళిపోయింది. తిరుమలలో నేలమాళిగలలో ఒదిగి వున్న ఆ జ్ఞాన భాండాగారాన్ని, రాగిరేకుల్లో దాగివున్న అన్నమయ్య అనంత సంపదను బయటకు తీసి పుణ్యం కట్టుకున్న ధన్యజీవి. వందల ఏళ్లనాటి ఆ కీర్తనలను పరిష్కరించి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ వంటి మహనీయులకు అందించారు. వాటిని రాళ్లపల్లివారు స్వరపరచి, ప్రపంచానికి పరిచయం చేశారు. అలా మొదలైన అన్నమయ్య పదాల స్వరరచనా యజ్ఞం అనేకమంది మహామహుల చేతిలో అఖండంగా సాగింది. సాగుతోంది. నేడు ఇంటింటా అన్నమయ్య వినిపిస్తున్నాడు. ఆ సాహిత్యానికి వ్యాఖ్యాన పరంపరలు మొదలయ్యాయి. తరతరాలకు ఆ సారస్వతం చేరువయ్యింది. ఈనాడు పదకవితా పితామహుడిగా అన్నమయ్యను జాతి కొలుచుకుంటోంది. ఈ పుణ్యానికి పునాదులై నిలిచిన ప్రభాకరశాస్త్రిని గుండె గుడిలో నిలుపుకొని కొలుచుకోవాలి. తిరుమల తిరుపతి దేవస్థానానికి ఎందరు చైర్మన్లు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు సేవలందించినా, అందరిలోనూ అగ్రేసరుడు చెలికాని అన్నారావు. తిరుమల నాయకుని సేవలో, అన్నమయ్య ప్రచారంలో వీరి పాత్ర విశిష్టమైంది. ఇంతటి చెలికానివారు వేటూరి ప్రభాకరశాస్త్రిని గురువుగా, మార్గదర్శిగా, హితునిగా, సన్నిహితునిగా భావించి, గౌరవించేవారు. ప్రభాకరశాస్త్రికి గురుపరంపర కూడా చాలా ఎక్కువ. తండ్రి సుందరశాస్త్రి తొలి గురువు.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గురుదేవులు మద్రాసు నుంచి తిరుపతికి వారి మకాం మార్చి, అక్కడ శ్రీ A.V. శ్రీనివాసాచారిగారితో కలిసి ఒక యోగ కేంద్రమును నిర్వహించుచూ అక్కడకి వచ్చిన వారికి ఎందరికో ఆరోగ్యము ప్రసాదించారు. శ్రీ శ్రీనివాసాచార్యులు గారు శ్రీ రామాలయంలో సేవలు పూర్తి చేసుకుని వచ్చేదాకా శ్రీ గురువుగారు, వారి రాక కోసం ఎదురు చూస్తూ ఉండేవారని, వారి ఇరువురి మధ్య అపారమైన ప్రేమ, అనురాగాలు ఉండేవని పెద్దలు చెప్పగా, పుస్తకాలలో చదివి ఆనందించాను. తిరుపతిలో యోగ కేంద్రములో జరుగు ప్రార్థనా సమయానికి, సాధకులతో పాటు, ఆ ప్రాంతములోని ఆవులు కూడా వచ్చి ప్రార్థనలో పాల్గొని వెళ్ళేవట. అలాగ తిరుపతిలో శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి గారు శరీరం విడిచిన తరువాత కూడా శ్రీ శ్రీనివాసాచార్యులుగారు ఆ యోగ కేంద్రాన్ని నిర్వహించి, ఈ రోజు దాకా వారి అనుయాయులు అక్కడ చక్కని ప్రేయర్స్ చేస్తూ, ఎందరికో Master CVV గారి, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి శక్తిని పంచుతున్నారు.

శ్రీ గురువు గారు, సాధకులకు, బాధితులకు శక్తిని పంచటమే కాక ప్రకృతిని కూడా వారి శక్తితో అనుసంధానము చేసారు. ఒక సారి తిరుపతిలో శ్రీ అన్నమాచార్య వర్ధంతి సభలు నిర్వహిస్తూ ఉండగా ఆ సభా ప్రాంగణానికి వేల సంఖ్యలో ప్రేక్షకులు రాగా, సభ ప్రారంభ సమయానికి కారుమబ్బు పట్టి, గాలివీచి, పెద్దవాన పడే వాతావరణము ఏర్పడి, వచ్చిన వారు అందరూ ఖంగారుగా అటు, ఇటూ తిరుగుతూ సభ నుంచి వెళ్ళిపోదాం అని అనుకుంటున్నప్పుడు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గురుదేవులు మైకు తీసుకుని, ఇపుడు వాన పడదు, మీరు భయపడవలదు, ప్రశాంతముగా ఎక్కడ వారు అక్కడ కూర్చోండి అని అనగానే, గాలితగ్గి, ప్రశాంత వాతావరణంలో సభ జరిగిందట. సభ తరువాత పెద్ద వాన పడిందట.

ఈ ప్రకారం శ్రీ గురుదేవల గురించి, వారి మహిమ, ప్రాణశక్తి పంపకం, వారి వెలుగులో ఎందరినో తీర్చిదిద్దిన విషయాలు వ్రాసుకుంటూ పోతే, ఎన్ని పుస్తకాలు అయినా వ్రాయవచ్చు.

ఇలా శ్రీ గురుదేవుల గురించి ఎంత చెప్పుకున్నా, అది తక్కువ అవుతుంది.

కావున ఈ అవకాశము ఇచ్చిన పెద్దలకు నమస్కరించుచూ, శెలవు.

ఇట్లు

పాంచాలవరపు పురుషోత్తమ గురువు గారి సూచనలతో

**పోతరాజు యోగానంద్**
Master CVV Yoga Centre, Vijayawada
Cell: 98488 56910, 96033 83888.

## విజ్ఞాన వటవృక్షము : వేటూరి

– మాశర్మ

ప్రజ్ఞాప్రభాకరుడిగా తెలుగునాట కోటి వెలుగులు వెదజల్లిన మహోన్నతమూర్తి వేటూరి ప్రభాకరశాస్త్రి. వీరిది కవి, పండితుల కుటుంబం. సాహిత్యం , సంగీతం, వైద్యం వేటూరివారి ఇంట్లో, ఒంట్లో ప్రకాశమానమై కోటి ప్రభలుగా ప్రభవించాయి. పన్నెండవ ఏటనే పద్యములల్లిన పుట్టుకవి. పండితుడు, కవి, పరిశోధకుడు, పరిష్కర్త, చరిత్రకారుడు, విమర్శకుడు, నాటక రచయిత. వీటన్నింటిని మించి గొప్ప యోగ సాధకుడు. అటు సాహిత్యంలోనూ, ఇటు యోగాభ్యాసంలోనూ ఎందరికో గురువు, గురువులకే గురువు వేటూరి. జీవించింది ఆరుపదుల కాలమే అయినా, అనంతకాలంలో నిలిచిపోయే అద్భుతమైన కృషి చేసిన ఆంధ్రతేజం. ఆయన ముట్టని కొమ్మలేదు, పట్టిన ప్రతి కొమ్మకు చేవను అందించిన ధీశాలి. సంస్కరణా శీలి. వేటూరి ప్రభాకరశాస్త్రి అనగానే అన్నమయ్య, జాను తెనుగు, చాటువులు గుర్తుకువచ్చి తీరుతాయి. ఎన్నో మహా గ్రంథాలను వెలికితీసి, పరిష్కరించి, ప్రపంచానికి అందించిన పుణ్యజీవి. ఈరోజు అన్నమయ్య గురించి మనం మాట్లాడుకుంటున్నామంటే, ఆ కీర్తనలు వింటున్నామంటే, పాడుకుంటున్నామంటే.. అదంతా ప్రభాకరశాస్త్రి చలువే. ఈ లోకం అన్నమయ్యను దాదాపు 400ఏళ్ళపాటు మరచిపోయింది. ఆ సాహిత్యం మన స్మృతి పథం నుంచి వెళ్ళిపోయింది. తిరుమలలో నేలమాళిగలలో ఒదిగి వున్న ఆ జ్ఞాన భాండాగారాన్ని, రాగిరేకుల్లో దాగివున్న అన్నమయ్య అనంత సంపదను బయటకు తీసి పుణ్యం కట్టుకున్న ధన్యజీవి. వందల ఏళ్లనాటి ఆ కీర్తనలను పరిష్కరించి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ వంటి మహనీయులకు అందించారు. వాటిని రాళ్లపల్లివారు స్వరపరచి, ప్రపంచానికి పరిచయం చేశారు. అలా మొదలైన అన్నమయ్య పదాల స్వరరచనా యజ్ఞం అనేకమంది మహామహుల చేతిలో అఖండంగా సాగింది. సాగుతోంది. నేడు ఇంటింటా అన్నమయ్య వినిపిస్తున్నాడు. ఆ సాహిత్యానికి వ్యాఖ్యాన పరంపరలు మొదలయ్యాయి. తరతరాలకు ఆ సారస్వతం చేరువయ్యింది. ఈనాడు పదకవితా పితామహుడిగా అన్నమయ్యను జాతి కొలుచుకుంటోంది. ఈ పుణ్యానికి పునాదులై నిలిచిన ప్రభాకరశాస్త్రిని గుండె గుడిలో నిలుపుకొని కొలుచుకోవాలి. తిరుమల తిరుపతి దేవస్థానానికి ఎందరు చైర్మన్లు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు సేవలందించినా, అందరిలోనూ అగ్రేసరుడు చెలికాని అన్నారావు. తిరుమల నాయకుని సేవలో, అన్నమయ్య ప్రచారంలో వీరి పాత్ర విశిష్టమైంది. ఇంతటి చెలికానివారు వేటూరి ప్రభాకరశాస్త్రిని గురువుగా, మార్గదర్శిగా, హితునిగా, సన్నిహితునిగా భావించి, గౌరవించేవారు. ప్రభాకరశాస్త్రికి గురుపరంపర కూడా చాలా ఎక్కువ. తండ్రి సుందరశాస్త్రి తొలి గురువు.

మద్దూరి రామావధాని మలి గురువు. శాస్త్రములలో తీర్చిదిద్దిన గురువు అద్దేపల్లి రామనాథశాస్త్రి. సాహిత్య, కవిత్వ లోకంలో విహరించడానికి ప్రభావితం చేసిన గురువు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి. యోగవిద్యా గురువు మాస్టర్ సివివి. ఇందరు సద్గురువుల సన్నిధిలో అభ్యాసం చేసిన కృషి ఊరికే పోలేదు. అబ్బిన ఆ సంస్కారం ఊరికే ఉండనివ్వలేదు. తాను కూడా సద్గురువుగా అవతరించి ఎందరికో మార్గదర్శనం చేసే సౌభాగ్యాన్ని దక్కేలా చేశాయి. జగత్ ప్రసిద్ధులైన తిరుపతి వేంకటకవులను, కొప్పరపు కవులను ఒకరినొకరికి పరిచయం చేసినవారిలో ప్రథమ శ్రేణీయులు ప్రభాకరశాస్త్రి. నాడు మద్రాస్ లో జరిగిన కొప్పరపు కవుల అనేక అవధాన, ఆశుకవిత్వ సభల్లో ప్రభాకరశాస్త్రి పాల్గొన్నారు. కొప్పరపువారి అసమాన శేముషికి అమితాశ్చర్యం చెందారు. బందరులో ఉన్న తన గురువు చెళ్ళపిళ్ళకు కొప్పరపుకవుల అనన్య ప్రతిభను పద్యాలలో వర్ణిస్తూ, ఉత్తరం రాసి పంపారు. అది చూసిన చెళ్ళపిళ్ళ కొప్పరపువారిపై నాటి పత్రికలకు వ్యాసాలు రాసి పంపారు. పద్య నవరత్నాలు రాసి, కొప్పరపువారికి పంపారు. చెళ్ళపిళ్ళవారి తీరుకు మురిసిపోయిన కొప్పరపువారు కూడా ప్రతిస్పందనగా, నవరత్నాలు రాసి, చెళ్ళపిళ్ళకు పంపారు. సాహిత్యలోకంలో తిరుపతి వేంకటకవులు – కొప్పరపు కవుల వివాదాలు ప్రసిద్ధం. కానీ, ఈ అద్భుతమైన పరిచయ ప్రారంభపర్వం పెద్దగా ఎవ్వరికీ తెలియదు. ఈ జంటల వివాదాల సందర్భంలో ఏ ఒక్కరి పక్కనా నిలువక, ఉభయుల వైపు సమానమైన గౌరవం చూపించినవారిలో ప్రభాకరశాస్త్రి ప్రధానులు. ఇద్దరిని విడదీసేవాళ్లు చాలామంది ఉంటారు. కలిపేవారు అరుదుగా ఉంటారు. ఆ అరుదైన అనురాగమూర్తి ప్రభాకరశాస్త్రి, శ్రీనాథుడు మొదలు ఎందరో మహాకవుల చాటువులను సేకరించి, పరిష్కరించి "చాటుపద్య మణిమంజరి"గా గ్రంథస్థం చేసిన ఘనత వేటూరిదే. ఈ పుణ్య విశేషం వల్ల, ఆ పద్యాలన్నీ మనం చదువుగలుగుతున్నాం. అనర్ఘ పద్యరత్నాలను తరతరాలకు బహుకరించిన జ్ఞానదాత వేటూరి. ముఖ్యంగా, శ్రీనాథుడుపై వీరు చేసిన కృషి విశిష్టమైంది. తెలుగుభాష ప్రాచీనతను మూల్యాంకనం చేయడానికి ప్రభాకరశాస్త్రి చూపిన తోవ గొప్పది. వారు సేకరించిన తాళ పత్రాలు, కనిపెట్టిన శాసనాలు మనకు ఎంతో ఉపకరించాయి. అమరావతిలోని ఒక శాసనంలో "నాగబు" అనే ఒక పదం వుంది. అది రెండువేల ఏళ్లనాటిదని పరిశోధకుల అభిప్రాయం. దీన్ని తొట్టతొలిగా కనిపెట్టింది వేటూరివారే. ఈ పదంపై ఇంకా వివాదాలు ఉన్నాయి. అవి తేలాల్సి వుంది. మద్రాస్‌లో ఉపాధ్యాయుడిగా, ప్రాచ్య లిఖిత భాండాగారంలో పండితుడు, పరిష్కర్తగా వీరు చేసిన సేవ అమూల్యం. అనేక తెలుగు గ్రంథాలను చారిత్రక ఆధారాలతో సవివరంగా పరిష్కరించి ప్రకటించారు. తెలుగు సాహిత్యానికే కాక, చరిత్ర, సంస్కృతి పరిరక్షణకు ఒక సైనికుడిలా పనిచేశారు. ఎన్నో అనువాద రచనలు కూడా చేశారు. సంస్కృతం, ప్రాకృతం, తెలుగులో వీరి పాండిత్యం అమోఘం. అన్నమయ్యతో పాటు తొలి తెలుగు రచయిత్రిగా చెప్పుకునే తిమ్మక్కను కూడా ఈయనే వెలుగులోకి తెచ్చారు. ప్రభాకర స్మారిక, చాటుపద్య మణిమంజరి, క్రీడాభిరామం, శృంగార శ్రీనాథం, రూపక మంజరి, భాసుని ప్రతిమా నాటక అనువాదం, మీగడ తరకలు,

# శాస్త్రిగారు ఆశీస్సులు

**- గ్రిద్దలూరి జయలక్ష్మి**

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి గురించి వ్రాయాలంటే వారిని చూడని మాకు అసాధ్యమే. వారి గురించి గ్రంథాలలో చదవటం, వారితో చరించిన వారి శిష్యులు శ్రీ శ్రీనివాసాచారి గారు, శ్రీ పోచిరాజు శేషగిరిరావు గారు, శ్రీమతి కల్పవల్లి గారు, శ్రీ కొత్త రామకోటయ్య గారు మరియు వారి సంతానము చెప్పగా విని ఆనందించడం తెలిసిన మాకు వారి గురించి పూర్తిగా తెలియదు. మా భాగ్యవశాన 1964 జూలై నుండి 1966 జూలై వరకు మహాలక్ష్మమ్మ గారితో ప్రార్థన చేసుకునే అవకాశం కలిగింది.

"నమస్కార ప్రియో భాస్కరః" అని శాస్త్రము. ప్రత్యక్ష సూర్యనారాయణుల వలెనే శ్రీ ప్రభాకరులను కూడా నమస్కరించి సమస్య చెప్పుకోగానే తీరిపోయేది.

నేను అనేక సంవత్సరాలు ఆరోగ్యరీత్యా ఎన్నో సమస్యలతో బాధ పడ్డాను. కానీ శ్రీ ప్రభాకరుల పేరిట ఒక కార్డు వ్రాసి పోస్ట్ చేయగానే ఆరోగ్యము చేకూరేది. వారి శిష్యులు కూడా ప్రార్థించేవారు.

వారు శరీరంతో ఉండగా అందరికీ ఆరోగ్యం చేకూర్చినట్లుగానే, శరీరం వదిలి పరమాత్మలో లీనమై అంతటా నిండి ఇంకా ఎక్కువగా అందరికీ ఆరోగ్యం చేకూరుస్తున్నారు.

వసుధైక(వ) కుటుంబం అని వారు భావించి, అందరినీ ఎంతో ప్రేమతో చూచి, వారిలోని బాధలను ఆర్తిచెంది, మాస్టర్ గారిని ప్రార్థించి వారందరి బాధలను తొలగించేవారు.

VPS - శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

VPS - వెంటనే ప్రతిస్పందించి స్వస్థత చేకూర్చేవారు

VPS - వసుధైక(వ) ప్రపంచం అని భావించి స్థిరచిత్తంతో అందర్నీ ఎంతో ప్రేమించే వారు

VPS - వెలుగునిచ్చు ప్రమిద అయి స్వచ్ఛజ్యోతిగా వెలిగిన వారు

గురుదేవుల గురించి రామకోటయ్య గారు, ఆచార్యులవారు, కల్పవల్లి గారు కూడా "మీకు ఏ సమస్య వచ్చినా గురుదేవులు, నాన్నగారు అయిన శ్రీ VPS గారికి నమస్కరించండి. వారే రక్షిస్తారు.

ఆంధ్రకామందకం, గౌరీ కళ్యాణం మొదలైనవి ప్రస్తుతం అందుబాటులో ఉన్నాయి. వీటితో పాటు వారు రాసిన పీఠికలు కూడా పుస్తకాల రూపంలో భద్రంగా ఉన్నాయి. కర్ణభారం, నాగానందం మొదలైనవి కూడా ఎన్నో ఉన్నాయి. వీరు రచించిన వాటిలో "దివ్య దర్శనం" అనే లఘుకావ్యం నిజంగానే దివ్య దర్శనం. దుర్గాదేవి దర్శన స్పర్శనలతో ఈ అలఘుకావ్యం రాసినట్లుగా పండిత, ఆధ్యాత్మిక లోకంలో ప్రసిద్ధం. యోగ, ఆధ్యాత్మిక మార్గాలలో నడచినా, మొదటి నుంచీ మూఢ విశ్వాసాలను ఖండిస్తూనే వచ్చారు. సమతావాదంతోనే నడిచారు. సంఘసంస్కరణలకు పెద్దపీట వేశారు. లెనిన్, మార్క్సును మించిన విప్లవకారుడు మహాత్మా గాంధీ అని, ప్రభాకరశాస్త్రి అనేవారు. వేటూరివారు చదివిన, విన్న, పరిష్కరించిన గ్రంథాలలోని విషయాలన్నీ ఆయనకు కరతలామలకమే. అంతటి జ్ఞాపకశక్తి ఆయన సొత్తు. సుప్రసిద్ధుడైన విస్సా అప్పారావు వీరికి వియ్యంకుడే. ప్రభాకరశాస్త్రి బందరులో చదువుకున్నప్పుడు కొండా వెంకటప్పయ్య, వల్లూరి సూర్యనారాయణరావు ఇంట్లో ఉండేవారు. ముక్త్యాల సంస్థానంతో ఎంతో అనుబంధం ఉండేది. ప్రఖ్యాత సినిమా గేయ రచయిత వేటూరి సుందరరామ్మూర్తికి ప్రభాకరశాస్త్రి సొంత పెదనాన్న. సుందరరామ్మూర్తి తన చిన్ననాట, పెదనాన్న నుండి ఎన్నో అంశాల్లో ప్రేరణ పొందారు. ముఖ్యంగా అచ్చతెనుగుదనం, వాగ్గేయకార ప్రభావం ప్రభాకరశాస్త్రి నుంచి ప్రేరణ పొందినట్లుగా సుందరరామ్మూర్తి చెప్పుకునేవారు. నాటి సమకాలిక మహాకవి, పండితుల విశేషాలు కూడా ప్రభాకరశాస్త్రి నుంచి సుందరరామ్మూర్తి గ్రహించారు. సుందరరామ్మూర్తిపై విశ్వనాథ సత్యనారాయణ ప్రభావం ఎంత ఉందో, అంతకు మించిన ప్రభావం పెదనాన్న నుంచి ఉంది. యోగిపుంగవుడు, నిత్య పరోపకార చింతనాపరుడు, విజ్ఞాన వటవృక్షం వేటూరి ప్రభాకరశాస్త్రి ఆగష్టు 29వ తేదీ,1950లో,62వ ఏట ఈ లోకాన్ని భౌతికంగా వదిలి వెళ్లిపోయారు. వీరు తనువు చాలించి కూడా 70ఏళ్ళు దాటింది. వీరు మరణించినప్పుడు నాటి పత్రికలు నెలరోజులపాటు పుంఖానుపుంఖాలుగా వార్తలు, కథనాలు, ప్రత్యేక వ్యాసాలు ప్రచురించాయి. అనంత తేజోమూర్తియైన ప్రభాకరశాస్త్రి లోకానికి పంచిన వెలుగులు అనంతంగా ప్రసరిస్తూనే ఉంటాయి. ప్రభాకరుడు నిజంగా ప్రభాకరుడు.

* * *

# శాస్త్రిగారు ఆశీస్సులు

**- గ్రిద్దలూరి జయలక్ష్మి**

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి గురించి వ్రాయాలంటే వారిని చూడని మాకు అసాధ్యమే. వారి గురించి గ్రంథాలలో చదవటం, వారితో చరించిన వారి శిష్యులు శ్రీ శ్రీనివాసాచారి గారు, శ్రీ పోచిరాజు శేషగిరిరావు గారు, శ్రీమతి కల్పవల్లి గారు, శ్రీ కొత్త రామకోటయ్య గారు మరియు వారి సంతానము చెప్పగా విని ఆనందించడం తెలిసిన మాకు వారి గురించి పూర్తిగా తెలియదు. మా భాగ్యవశాన 1964 జూలై నుండి 1966 జూలై వరకు మహాలక్ష్మమ్మ గారితో ప్రార్ధన చేసుకునే అవకాశం కలిగింది.

"నమస్కార ప్రియో భాస్కరః" అని శాస్త్రము. ప్రత్యక్ష సూర్యనారాయణుల వలెనే శ్రీ ప్రభాకరులను కూడా నమస్కరించి సమస్య చెప్పుకోగానే తీరిపోయేది.

నేను అనేక సంవత్సరాలు ఆరోగ్యరీత్యా ఎన్నో సమస్యలతో బాధ పడ్డాను. కానీ శ్రీ ప్రభాకరుల పేరిట ఒక కార్డు వ్రాసి పోస్ట్ చేయగానే ఆరోగ్యము చేకూరేది. వారి శిష్యులు కూడా ప్రార్థించేవారు.

వారు శరీరంతో ఉండగా అందరికీ ఆరోగ్యం చేకూర్చినట్లుగానే, శరీరం వదిలి పరమాత్మలో లీనమై అంతటా నిండి ఇంకా ఎక్కువగా అందరికీ ఆరోగ్యం చేకూరుస్తున్నారు.

వసుధైక(వ) కుటుంబం అని వారు భావించి, అందరినీ ఎంతో ప్రేమతో చూచి, వారిలోని బాధలను ఆర్తిచెంది, మాస్టర్ గారిని ప్రార్థించి వారందరి బాధలను తొలగించేవారు.

VPS - శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

VPS - వెంటనే ప్రతిస్పందించి స్వస్థత చేకూర్చేవారు

VPS - వసుధైక(వ) ప్రపంచం అని భావించి స్థిరచిత్తంతో అందర్నీ ఎంతో ప్రేమించే వారు

VPS - వెలుగునిచ్చు ప్రమిద అయి స్వచ్ఛజ్యోతిగా వెలిగిన వారు

గురుదేవుల గురించి రామకోటయ్య గారు, ఆచార్యులవారు, కల్పవల్లి గారు కూడా "మీకు ఏ సమస్య వచ్చినా గురుదేవులు, నాన్నగారు అయిన శ్రీ VPS గారికి నమస్కరించండి. వారే రక్షిస్తారు.

మేమంతా గడ్డిపరకల వంటి వాళ్ళము" అని చెప్పేవారు. ఏ జన్మ పుణ్యమో నన్ను వారి కుటుంబ సభ్యులు కూడా ఇంట్లో మెంబరుగానూ, సొంత చెల్లెలిగానూ ఆదరించారు, ఆదరిస్తున్నారు.

మాకు ఏదైనా సమస్య వస్తే శ్రీ శాస్త్రిగారికి నమస్కరించి, ఆ సమస్యను విన్నవిస్తూ ఒక కాగితం మీద వ్రాసి, దానిలో చిటికెడు విభూతి వేసి, శ్రీ శాస్త్రిగారి ఫోటో వెనుక పెట్టి, ప్రార్థన చేస్తాము. మనము మనసా, వచసా, కర్మణా సంపూర్ణ శరణాగతితో చేస్తే, వారి రక్షణ, అండదండలతో మనము ఆ సమస్యల నుండి గట్టెక్కుతామని మా విశ్వాసము. ఎప్పటికీ వారి రక్షణ కవచముతో మాస్టర్ CVV దంపతులు మన వెన్నంటి ఉండి, వారి నీడలో ఉన్న మనలను రక్షిస్తూ, వారి ఆలోచనలో జీవింప చేస్తున్నారు.

ఎన్నో విధాల మమ్ములను కాపాడుతున్న వారికి మనసా, శిరసా నమస్కరిస్తున్నాను.

* * *

# శాస్త్రిగారు అనుగ్రహం

- గ్రిద్దలూరి కృష్ణమూర్తి

ప్రేమ స్వరూపము, పరబ్రహ్మ స్వరూపమైన M.CVV గారిచే ఉపదేశం పొందిన ఆత్మ గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు, వారి ధర్మపత్ని అయిన శ్రీమతి మహాలక్ష్మమ్మ గారు, యోగ సాధకులైన మనందరికీ రక్షణగా ఉన్నారు. ఆత్మ గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి శిష్యురాలైన శ్రీమతి చంద్రకాంతమ్మగారు నన్ను బుజ్జగించి, బుజ్జగించి యోగ ప్రవేశం చేయించారు. నాది నెల్లూరు. శ్రీమతి చంద్రకాంతమ్మ నా గురువుగారు.

"నా గురువుగారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిని మొదట స్మరించి, తర్వాత మాస్టర్ గారిని ప్రార్థనతో స్మరిస్తాను" అని చంద్రకాంతమ్మ గారు చెప్పారు. అంటే మొదట నా గురువుగారైన చంద్రకాంతమ్మ గారిని ప్రార్థనతో స్మరించి, తర్వాత శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారికి నమస్కారము, పిమ్మట మాస్టర్ నమస్కారము చేయవలెను అని చెప్పకనే చెప్పినారు. నా యోగ ప్రవేశము 1959 వ సంవత్సరములో జరిగింది. 1964 లో నాకు చి॥సౌ॥ జయలక్ష్మితో వివాహము అయింది. హైదరాబాదుకు ఉద్యోగం కొరకు వెళుతున్నానని వారికి చెప్తే, "నాయనా! నా గురువుగారి కుటుంబము విద్యానగర్‌లో ఉన్నారు. నీవు వెళ్ళి వాళ్ళతో కలసి ప్రార్థన చేసుకో" అని చెప్పినారు. గురువు అనుగ్రహం వలన ఉదయము, సాయంత్రము విడువకుండా ప్రార్థన చేయుచున్నాను. ఏ కారణము వల్లనో అనేక విధములైన అనారోగ్యములు ఉండేవి. ముఖ్యముగా నా శ్రీమతి జయలక్ష్మికి.

1966 లో ఒకరోజు ఉదయం 6 గంటలకు ప్రార్థనకు కూర్చున్నప్పుడు "ఏమిటి మాస్టర్ ఇన్ని troubles! ఇన్ని బాధలు కలుగుచున్నవి, దీనికి అంతం లేదా!" అని ప్రార్థించగా, వెంటనే శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి ఫోటో ప్రేయర్‌లో పెట్టవలెను అని తలంపు కలిగినది. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి ఫోటో నా దగ్గర లేదు. కానీ ముందుచూపుగా మా తమ్ముడు ప్రజ్ఞా ప్రభాకరము వారం రోజుల ముందు నాకు ఇచ్చినాడు. ఈ పుస్తకంలో ఉన్న శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి దంపతుల ఫోటో పుస్తకముతోనే పెట్టి తర్వాత ఫ్రేమ్ చేయించి ప్రార్థనలో పెట్టినాను. ఈరోజుకి ఆ ఫోటో ఉన్నది. ఫోటో పెట్టిన తరువాత బాధలు తగ్గుట క్రమంగా మొదలైనది. అందువలన మాకు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి రక్షణ ఉన్నది అని తెలియజేస్తున్నాను.

గురువుగారి చంద్రకాంతమ్మగారికి, "నా శ్రీమతికి 3 అబార్షన్లు అయిన తర్వాత ఇప్పుడు మూడవ నెల" అని జాబు వ్రాయగా, నాకు గురువు జాబు ద్వారా, "నాయనా! ఈ సారి మగపిల్లవాడు పుడతాడు. 'వేంకట ప్రభాకర' అని నామకరణము చేయండి" అని వ్రాసినారు. వారి ఆజ్ఞప్రకారము మా అబ్బాయికి అదే పేరు పెట్టాము.

ఆత్మ గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి అనుగ్రహము, కృప మాకు కలుగుచున్నవి అంటే దానికి కారణము మా గురువు శ్రీమతి చంద్రకాంతమ్మ గారే. గురుభక్తి అంటే ఏమిటో నూటికి నూరు పాళ్ళు గురువు దారిలో నడిచి చూపించారు. ఉదాహరణకు 'ప్రజ్ఞా ప్రభాకరము పదే పదే చదవంగ చదవంగా, అందులోని అంశాలు నిత్య జీవితంలో ఆచరణకు దారి తీస్తాయి' అని ఆ పుస్తకమును తల క్రింద పెట్టుకొని పడుకునేవారు. నేటికీ పరబ్రహ్మ స్వరూపులైన మాస్టర్‌గారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు నిత్యమూ ప్రార్థనలో మమ్మల్ని ఆదుకుంటున్నారు అనేది నా విశ్వాసము. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు "నేను ఉన్నాను" అని అనడం నిత్యమూ అనుభవంలో ఉన్నది. మాస్టర్ CVV గారి అనుగ్రహముతో యోగసాధన శ్రద్ధ, భక్తితో చేసినందున ప్రభాకరులు ప్రజ్ఞాప్రభాకరులు అయినారు. మాస్టర్‌గారే ప్రభాకరులను ఈ విధముగా తీర్చిదిద్దినారు. ప్రజ్ఞాప్రభాకరులై వారి అనుభవమును పద్యాల రూపములో మనకి అందించారు. వారు ఏమి పొందినవి, వారిలో నుండి ఏమి తొలగినవి, వారు ఏ స్థితిలో ఉన్నది కూడా తెలిపినారు. 'త్రోవ ఎరిగితి' – అంటే మనస్సు అంతర్ముఖం అయినది. పుట్టుక స్థానము వైపు తిరిగింది అని అర్థము.

సాధకులలో ఉన్న అడ్డంకులు – పాప సంకల్పములు. అవి నాశనము కావలెనని, మంచి తలంపులు కలగవలెనని, అహంకార మమకారములు తొలగి పోవలెనని, అప్పుడే నిరంతర ఆనందము కలుగును అని తెలిపినారు. ఈ పవిత్ర యోగ స్థాపకులైన మాస్టర్ CVV గారు పరబ్రహ్మము. మహర్షులు ఆ పరబ్రహ్మ అనుగ్రహము కొరకు అడవులలో ఉండి తపస్సు చేస్తారు. ఈ యోగ ఫలమును అందరూ సంసారములతో ఇంటిలో నుండే పొందవచ్చును అని, దీనికి ఉదాహరణ నేనే అని పద్యములో తెలిపినారు.

గురువుగారైన శ్రీమతి చంద్రకాంతమ్మగారు శరీరం వదిలిన తరువాత, నాకు శరీర గురువు లేరని బాధ పడుచుండగా వారే నన్ను శ్రీ A.V. శ్రీనివాసాచారి(తిరుపతి) గారిని చూపించారు. గురుభక్తి కలిగిన శిష్యులు శ్రీ A.V. శ్రీనివాసాచారిగారు, శ్రీమతి కల్పవల్లిగారు, శ్రీ కొత్త రామకోటయ్యగారు, శ్రీ పోటిరాజు శేషగిరిరావుగారు, శ్రీమతి చంద్రకాంతమ్మగారు – వీరిని శ్రీ శాస్త్రిగారు తీర్చిదిద్దారు. ఆత్మ గురుదైవులైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి కుమారులు – శ్రీ సుందరమూర్తిగారు, వారి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీదేవమ్మగారు మరియు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి కుమార్తె శ్రీమతి సుజాత అమ్మగారు వీరందరితో కలసి ప్రార్థన చేసుకోవడం నా భాగ్యముగా భావిస్తున్నాను.

* * *

# శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యోగజీవనము - ఉదార చరిత

- మునిగోటి వేణుగోపాల్

యోగేన చిత్తస్య పదేన వాచాం
మలం శరీరస్య చ వైద్యకేనామ్ ।
యోపాకరోత్ తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలిరానతోస్మి ॥

వ్యాకరణ మహాభాష్యం అధ్యయనం చేసేవారు ప్రారంభంలో ఈ ధ్యానశ్లోకం పఠించడం పరిపాటి. పతంజలి మహర్షి, మనోమాలిన్యం తొలగించడానికి యోగసూత్రాలు, భాషాదోషాలు తొలగించడానికి మహాభాష్యం, శరీర వ్యాధులు తొలగించడానికి వైద్యక గ్రంథాలు రచించారు. ఈ విధంగా మనోవాక్కాయకము మూలాల మలాలను, పోగొట్టారు. ఆ మునిశ్రేష్ఠునికి నమస్కరిస్తున్నాను" అని శ్రీ వేటూరివారిని గురించి కూడా స్మరించి చాలా సమంజసంగా పేర్కొన్నారు శ్రీ ఆచార్య తిరుమల రామచంద్ర.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి జీవితము సార్థకమైనది. బహువిధాల ఫలవంతమైనది. ఆయన జీవితాన్ని నిశితంగా గమనిస్తే పూర్వార్థము సాహిత్య సేవలోనూ, ఉత్తరార్థము యోగ సేవలోనూ తరించినట్లుగా ఉండినది. శ్రీ శాస్త్రిగారి సాహిత్యము ఆయన యోగగురువైన శ్రీ మాస్టరుగారి యోగ సాహిత్యము. శ్రీ శాస్త్రిగారు జరిపిన ట్రీట్‌మెంట్లు, ఉత్తర-ప్రత్యుత్తరాలు మొదలగునవి ఆధారంగా ఆయన యోగజీవనమును గురించి కొంచమైనా తెలుసుకోవడానికి ఆస్కారముంది. యోగపథమనేది పలుమార్గాలు, పలు దృక్పథాలు కల్గి ఉంటుంది. ప్రత్యేకించి శ్రీ శాస్త్రిగారి పద్యాలు ఆయన యోగభావాలను గురించి, యోగ అనుభవాలను గురించి తెలియజేస్తాయి.

శ్రీ శాస్త్రిగారు చాలా సరళమైన వ్యక్తి. సాహిత్యాకాశములో గొప్ప ధృవతార, అయినా ఆయన తనను తాను తక్కువగా అంచనా వేసుకొని చెప్పేవారు. ఆయనకు బహుభాషలతో పరిచయముంది. ఎన్నో ప్రాచీన గ్రంథాలను సంపాదించారు. పరిష్కరించారు. పీఠికలను సమకూర్చారు. ఆయన గొప్ప నిర్మాణాత్మక విమర్శకుడు. గొప్ప వ్యాసకర్త. వ్యవహారిక భాషా ఉద్యమాన్ని సమర్థించి అందులో రచనలు చేసిన మొనగాడు. ఆయన శాసన పరిశోధకుడు. లిపి పరిశీలకుడు. గొప్ప వ్యాఖ్యాత. వృక్షశాస్త్రము, ఖగోళశాస్త్రము మొదలగు వానితో పరిచయం కలిగినవాడు. గొప్ప అనువాదకుడు. జానపదవాఙ్మయం మీద శ్రద్ధ కల్గినవాడు. స్త్రీ, బాల సాహిత్యము, పామర సాహిత్యముపై ప్రత్యేక శ్రద్ధ చూపినవాడు. మార్గదర్శకుడైన ఉపన్యాసకుడు. శ్రీ వేంకటేశ్వర మ్యూజియమును స్థాపించినవాడు. అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలను ఆరంభించినవాడు.

కేవలము వైవిధ్యమైన ఆయన రచనల, శీర్షికల పేర్లను పేర్కొంటూ వ్రాయబడిన సిద్ధాంతవ్యాసమునకై 'ఉస్మానియా యూనివర్శిటీ – హైదరాబాదు వారు ఒకరికి "ఎం.ఫిల్ డిగ్రీ"ని ప్రధానం చేశారు. దీనిని బట్టి రాశిలోనూ, వాసిలోనూ ఆయన రచనలకు గల ప్రామాణికత అర్థమౌతుంది.

శ్రీ శాస్త్రిగారు సంప్రదాయ విలువలను పాటించే ఆదర్శవాది. ఆధునికవాది. గొప్ప యోగచికిత్సకుడు. మహర్షి. ఎన్నో రంగములలో అగ్రగణ్యుడు. ప్రజ్ఞాప్రభాకరము అనే ఆయన జీవితచరిత్ర, ఆయన యొక్క భిన్నవిధాల వ్యక్తిత్వ వికాసాన్ని ప్రస్ఫుటంగా తెలియజేస్తుంది. శ్రీవారు అనుష్ఠించిన యోగము, సత్యయోగము (లేక) భృక్తరహిత తారకరాజయోగము (లేక) నవీన యోగమార్గము అని తెలియజేయబడినది. సంప్రదాయ యోగాలకన్నా ఇది విభిన్నమైనది. శ్రీ శాస్త్రిగారి గురువైన శ్రీ మాస్టరుగారు యోగలక్ష్యాన్ని గురించి శ్రీ శాస్త్రిగారితో ఇలా పేర్కొన్నారు... "ఈ యోగమున నెవcడు గానీ ప్రత్యేకముగా కడతేరcజాలడు. తాను, తన చుట్టుపట్టులవారు, తన ఆప్తులు ననుక్రమముగా ప్రేమ వ్యాపకమగు తీరు ననుసరించి, తాను లోకమునంతను ప్రేమించి గడతేర్చువాడు కావలె. తన ప్రేమ సర్వలోకవ్యాప్తము గానంతవరకు నెవ్వcడు గాని కడతేరc జాలడు. అఖండము సర్వవ్యాపకమునగు తత్త్వమును బడయుటకు తాను నఖండుcడు, సర్వవ్యాపకుcడు కాక తప్పదు. దేశ, కుల, జాతి, మతాది పరిచ్ఛేదములతో వేఱుపడిపోయి సర్వప్రజతో సామరస్యము కుదుర్చుకోలేనివాcడు సంసారబంధమున కొట్టుకాడవలసినవాcడే! బహిర్ముఖముగా సాగుచున్న బహుత్వమును సాగనిచ్చుచునే అంతర్ముఖముగాc దిరిగి అందేకత్వమును గుర్తించి వర్తించుట ఈ యోగసాధనమున కొక ఫలితము. మన పరిపూర్ణత, భవిష్యత్తులో నున్నది కానీ, భూతము కాలేదు. కనుక భూతమను పీఠికపై నెలకొని భవిష్యత్తున పరమార్థ మనుభవింపవలసి యున్నది. సాగుచున్న ప్రవృత్తికి భంగము కలుగరాదు. ఇది నివృత్తి మార్గము కాదు. రాజయోగమార్గము. గార్హస్థ్యము ఉండవలెను. సన్యాసి కారాదు. సౌఖ్యముండవలెను. ఆహారాదులు సరిగా, ససిగా గైకొనుచుండవలెను.

ఇట్టిచో నీవు నీ యుద్యోగమున నుండుటావశ్యకము. నీ యుద్యోగము నీ జీవికకే కాక లోకమునకు గూడా నుపకారకము. ఆరోగ్యవంతుడవై నీ యుద్యోగమున నుండి తిన్నగా యోగసాధనము సాగించుకొనుచుండుము. నీ విక్కడ నుండ గోరుట నా సన్నిధిలాభము కొఱకే గదా! నేను సదా నీలో నుందును. నీకు వలసిన సహాయము నీలో నుండి జరుపుచునే యుందును. ఇక్కడ నీ కేతీరున శరీరమున సంస్కారము జరుగుట గుర్తుకు వచ్చెనో, ఆ తీరుననే యెక్కడ నున్నను అనుభూతి గుర్తుకు రాగలదు. ఉదయము జరిపిన యోగసాధనము శరీరమున సాయంకాలముదాcక పనిచేయుచునే యుందును. ఎప్పుడెప్పుడెంతెంత జరుగవలెనో అంతంత జరుగును.

నీలోని సంస్కారము జరపునది ప్రజ్ఞాకలిత మయిన చైతన్యముగాని జడశక్తి గాదు. అది ఎలక్ట్రిసిటీవలె పనిచేయునది కాదు. ఎలక్ట్రిసిటీ హద్దు దాటి అక్రమముగా నుపయోగించినచో కీడు తేcగలదు. నీలో నిప్పుడు క్రొత్తగా ప్రవేశించిన ప్రజ్ఞ, నీ వధికముగా నుపయోగించుకోc గోరినను అది యట్లు పనిచేయదు. ఎంత చేయవలెనో అంతే చేయగలదు. కావలెనన్నను నీవావశ్యకతకెక్కువగా కనులు మూసికొని యుండజాలవు. లోపల నావశ్యకమయిన పని జరుగుచుండగా కనులు తెఱువను జాలవు. ఏదేని యాకస్మికముగా కార్యాంతరము కలుగుటో, ఎవరేని వచ్చి పలుకరించుటో జరిగిననూ అప్పుడు విక్షేపము జరుగునని వెఱువ నక్కఱలేదు. ఇట్లు తొందర కలిగినది, దాని ననువర్తింపవలసియున్నది, అని ప్రార్థనాపూర్వకముగా నంతరాత్మకు విన్నవించుకొని యాకార్యము ముగించుకొనవచ్చును. అది ముగిసినంతనే జరుగవలసిన యోగసాధన జరుగcగలదు. ప్రయాణములో, రైలులో, బండిలో, నడకలో ఇంకేమేని వ్యవహారములలో వర్తిల్లవలసి వచ్చినప్పుడు సరియైన వేళ తప్పిపోకుండా ఒక క్షణమాత్రము మనసున స్మరించినc జాలును. కార్యాంతరములు తీఱి విశ్రాంతి దొరికినప్పుడు జరుగవలసిన సాధనమెల్ల జరుగcగలదు.

వివేకమును, సత్యమును, ధర్మమును గుర్తించుకొనుచు నంతరాత్మ నారాధించుచు లోలో జొచ్చుకొలదిని, నీకు వలసిన యుద్బోధములు లభింపగలవు. అట్టి యుద్బోధములను నీవు నీలో నెక్కడి నుండి యెట్లు పడయుచుంటివో క్రమక్రమముగా తెలిసికొనcగలవు".

ఈ యోగము స్వయంప్రజ్ఞ సంపాదించుకొనుట గురించి అధిక ప్రాధాన్యత ఇస్తుంది. సిద్ధాంతముల కన్నా ఆచరణలో అనుభూతిని పొందుటకు ఆమోదిస్తుంది. శ్రీ శాస్త్రిగారు యోగానికి క్రమక్రమముగా అధికాధికముగా అంకితమైనారు.

**కవితాశిల్పము సల్పcగా దొలుత వేడ్కల్ రేగె నాకున్, గృతుల్**
**చివురొత్తెన్, వెస మోము మొత్తె, నిcక నాచే జెల్ల వీ కల్ల బొ**
**ల్లి వినోదంబు, లివే జరామరణముల్, చీడన్ హతం బార్చి, పు**
**ట్టువు చెట్టున్ సఫలీకరించుకొని యంటుల్ గట్టెదన్ మాలినై.** -శ్రీ శాస్త్రిగారు

మొదట కవితా శిల్పము అనగా అందమైన కవిత్వము చెప్పాలని వేడుక(కోరిక) నాకు కల్గింది. కొన్ని కవిత్వాలు వ్రాశాను. అయితే ఇపుడు వీటిపై విరక్తి కల్గినది. ఇలాంటి వ్యర్థమైన వినోదాలను నేను ఇక అంగీకరించను. జరా-మరణములు, చీడలు అనగా ప్రమాదాలు, రోగాలు మొదలగు వానిని అంతముచేసి, ఈ జన్మ అనే చెట్టును ఫలవంతము చేసుకొని, తోటమాలి వలె అంట్లు కట్టెదను. ఇక్కడ పుట్టువు అనగా సృష్టి అని కూడా అర్థముంది. తోటమాలి ఏమి చేస్తాడంటే అంట్లు కూడా కట్టుతాడు. అంట్లు కట్టడము అనగా ఒక మొక్క లేక విత్తనములోని మంచిభాగములను అంశములను తీసుకొని వేరొక మొక్క లేక

విత్తనములను మేలి అంశాలను తీసుకొని రెండో అంటుగట్టి మరింత ఉత్తమమైనదిగా రూపొందించుట. ఈ ప్రక్రియ శ్రేష్ఠమైన ఉన్నతోన్నతమైన ఆశించేటువంటి ఫలితము వచ్చువరకు కొనసాగి ఉంటుంది.

యోగపరముగా శ్రీ శాస్త్రిగారు ఈ పద్యములో ఎన్నో అర్థాలను ఇమిడ్చినారు. జరా-వ్యాధి-మరణాల కతీతంగా దివ్యమైన భౌతిక శరీరమును సాధించడము యోగలక్ష్యము. అసలు మానవజాతి ఉనికికి, ఆవిర్భావానికి ఈ లక్ష్యము సాధించడమే పరమ ప్రయోజనము. శ్రీ శాస్త్రిగారు అనుసరించిన భృక్త రహిత తారకరాజయోగము యొక్క ముఖ్య లక్ష్యములలో ఇది కూడా ఒకటి. శ్రీ శాస్త్రిగారు ప్రతిభా-పాటవాలను, శక్తి-సామర్థ్యాలను అల్పమైన ప్రయోజనములకే కాకుండా పుట్టువు చెట్టు సఫలీకరించుకొనుటకు అనగా జన్మ లేక ఈ సృష్టి అనే చెట్లను ఫలవంతము చేయుటకు అనగా లక్ష్యసాధనకు కృషి చేస్తానని, అంతేకాకుండా జరా-వ్యాధి-మరణములనే చీడలకు అంతము పల్కి, తోటమాలిగా ఈ ఉన్నతోన్నత యోగ లక్ష్యసాధన అనే అంటులను కట్టెదను అని అంటున్నారు. అనగా యోగవ్యాప్తికి, ప్రాప్తికి కూడా కృషి చేసెదనని ఆయన పేర్కొంటున్నారు. మొక్కలకు లేక చెట్లకు వచ్చే వ్యాధిని చీడలు అంటారు. ఇక్కడ ఇలా అనడంలో మానవుల కర్మలు, రోగములు, పాపములు, ఆపదలు, ప్రమాదాలు, సమస్యలు మొదలగు వాటినన్నింటిని గురించి ధ్వనింపజేయడమైనది. వీనికన్నింటికి యోగము ద్వారా ముగింపు పల్కెదనని శ్రీ శాస్త్రిగారి భావన.

**త్రికరణ శుద్ధిగా భవదధీనుడనై యితర ప్రవృత్తి వీ**
**డికొని పరార్థలాభ మొకటే గమనించుచు నుందు, నింక మా**
**యికము ధనాధికమ్ము గణియింపను, సత్యదయోపకార సా**
**ర్థక మగు నాత్మచింతన పథంబును దృష్టి చరిం నీశ్వరా ! - శ్రీ శాస్త్రిగారు**

మాయికము : మాయావి అంటే మాయికుడు చేసేది మాయికము. అంటే మాయావి చేసేది మాయ. పదోన్నతి, సంపద, ఐశ్వర్యము మొదలగునవి మాయావి లాంటివే అని కొందరి భావన.

త్రికరణశుద్ధిగా అనగా మనస్సు, వాక్కు కర్మలను నిర్మలము చేసుకుని, నీ ఆధీనములో అనగా మాస్టర్ గారికి సంపూర్ణ సమర్పణము గావించుకుని, ఇతర ప్రవృత్తులను, అనగా స్వార్థ కార్యకలాపములను వదలుకుని పర్మాలాభమే అనగా ఆధ్యాత్మిక దివ్యతత్వ లాభమును గమనించుచునుందును.

మాయలాంటి పదోన్నతి ఉన్నతులను, ధనమును, కీర్తి మొదలగు వానిని నేను లెక్కించను. సత్యము, దయ, ఉపకారములతో కూడిన ప్రయోజన పూర్వకమైన, అర్థవంతమైన, ఆత్మచింతన మార్గములో మాత్రమే నేను ప్రయాణము చేస్తాను. ఇక్కడ ఈ యోగములో సాధకులకు అవసరమైన యోగ్యతలు, అర్హతలు వుండవలసిన లక్షణముల గురించి, శ్రీ శాస్త్రిగారు చాలా అద్భుతముగా సూచించినారు. త్రికరణ శుద్ధిగా

మాస్టర్ గారికి సమర్పణ చేసుకోవాలని మనస్సు, వాక్కు కర్మలు పవిత్రముగా వుండవలెనని ఆయన అన్నారు. అందుకే "ప్రజ్ఞా ప్రభాకరము"లో మాస్టర్ గారు శ్రీ శాస్త్రిగారితో ఇలా పేర్కొన్నారని చెప్పబడింది. మానవ ప్రజ్ఞ పెరుగన్-పెరుగను ఈశ్వరునకుఁ జేరువ కానుఁగాను సర్వప్రాణి సృష్టి రహస్యములను మానవుడు గుర్తింపగల్గవచ్చును. మానవత పెరుగన్-పెరుగను తద్ హృదయమున నుండి ప్రజోద్భేదములు పెరుగగలవు. ఇపుడు పెంపొందుచున్న శాస్త్రములన్నియును అట్టివే. మానవ హృదయము నిర్దుష్టము కానంతవరకు, మానవవాక్కు సుపవిత్రము కానంతవరకు, మానవ కార్యములు వినిర్మలములు కానంతవరకు, సృష్టి రహస్యము మానవత గుర్తునకందనేరదు. ప్రయత్నములు సాగుచున్నవి. ఈ యోగము ఆత్మచింతన మార్గమైనటువంటిది. సాధకులు సత్యము, దయ, ఉపకారముల లాంటి వానిని కూడా యోగములో పాటించాలి. తద్వారా ఆధ్యాత్మిక లాభములు ప్రాప్తమౌతాయి.

**నారలు గట్టు చీర లశనంబులు కాయ గసుళ్ళు కొండలున్**
**కారడవుల్ నివాసములుగా దపియించి మహర్షులెవ్వరిన్**
**జేరుకొనం దలంచి రల చిన్మయతత్త్వ సర్వమానవో**
**ద్ధారము గోరికొన్న యవతారము మద్గురుమూర్తి గొల్చెదన్.** - శ్రీ శాస్త్రిగారు

నారతో తయారైన వస్త్రములు ధరించి కందమూలములు, కాయలు, ఆహారముగా తింటూ కొండగుహలలోనూ, కారడవులలోనూ నివసిస్తూ మహర్షులు తీవ్రమైన తపస్సుచేస్తూ, ఏ దివ్యశక్తిని చేరుకోవాలని కోరుకుంటారో అట్టి చైతన్యమయమైన, తత్వరూపమైన, సర్వ మానవుల ఉద్ధారమును అభిలషించిన అవతార స్వరూపుడైన నా గురుమూర్తిని అనగా మాస్టర్ గారిని నేను ఆరాధించెదను (ప్రార్థించెదను, వేడుకొందును).

మాస్టర్ గారి యోగసాహిత్యములో వశిష్ఠుడు, గౌతముడు, మైత్రేయి మొదలగు మహర్షుల ప్రస్తావన ఉంది. "నేను ప్రజ్ఞ యొక్క పుట్టుకను గురించి ఆరా తీయగా నాకు వశిష్ఠుని 3200 కల్పాల వ్యాఖ్యానము నా జ్ఞానమునకు వస్తున్నది. నా పథకము యొక్క అన్వేషణకు ఆయన మద్దతు యిస్తున్నాడు. గోళక ఆర్యబోధినిలో నిలచి వుండి ఆయన నాకు సహాయము చేస్తున్నాడు" అని ఎం.టి.ఎ. పేర్కొన్నాడు. (మహాత్మా లేఖలు - వాల్యూమ్-3, తారీఖు - 25-1912). గోళము లేక గోళకము అనగా వ్యక్తి విశ్వము లోపల వున్నా కూడా, విశ్వమందలి సర్వముతో తాదాత్మ్యము చెంది వుండడము అని ఆధ్యాత్మిక సాహిత్యములో పేర్కొనబడింది.

గౌతముడు, మైత్రేయి మహర్షుల గురించి ప్రస్తావన మహాత్మా లేఖలు- వాల్యూమ్ - 1, తా. 7-11-1910 లో ఉన్నది. సర్వమానవోద్ధారము అనడంలో మాస్టర్ గారి యోగలక్ష్యము సూచించ బడినది.

ఎందుకంటే మాస్టర్ గారు "ఈ యోగములో ఏ ఒక్కడూ విడిగా కడతేరజాలడు" అని పేర్కొన్నారు. ఈ యోగలక్ష్యము సమస్త మానవాళి అభ్యుదయము. చిన్మయతత్త్వము యొక్క నిరాకార సాకారము. మాస్టర్ గారు స్వరూపము అంటే సగుణ, నిర్గుణములు రెండూ మాస్టర్ గారిలో కలిసివున్నాయి. ఒక మీడియమ్ కు వ్రాసిన ఉత్తరములో మాస్టర్ గారు "మీరు కావాలనుకుంటే నా ఫోటోను పెట్టుకోండి" అని వ్రాసారు. అంటే ఫోటో ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే. ఉంటే సగుణతత్త్వంగా, లేకుంటే నిర్గుణతత్త్వం. అనంతమైన దివ్య చైతన్యశక్తిని ఒక నిర్దిష్ట ఆకారములో మాత్రమే భావించడం సరియైనది కాదు. మాస్టర్ గారు "నేను సదా నీలోనుందును. నీకు వలసిన సహాయము నీలోనుండియే జరుపుదును. ఇక్కడ నీకేతీరున శరీరమున సంస్కారము జరుపుట గుర్తుకు వచ్చెనో, ఆ తీరుననే యెక్కడ ఉన్నను అనుభూతి గుర్తుకు రాగలదు" అని అన్నారు. ఇది సర్వత్రా వ్యాపించియున్న చిన్మయతత్త్వమును సూచించుచున్నది.

**ఆశల్ రేపఁగ నంతరంగపు టరణ్యం బంధ కారమ్మునన్**
**దాసోహమ్మని చొచ్చితిన్ వెదక నంతర్యామి నాలో నేదో**
**భాసిల్లెన్ జిఱువెల్గు చేర జన దావమ్మయ్యె నా యగ్నిలో**
**నే సోహమ్మయి నిల్చితిన్ బిదప నేదీ నాతనం బయ్యెడన్. – శ్రీ శాస్త్రిగారు**

ఆశలు అనేవి కల్పించబడగా, అంతరంగమనే అరణ్యము యొక్క చీకటిలో నీకు దాసుడనై ప్రవేశించినాను. వెదకసాగాను. ఓ అంతర్యామీ! ఏదో చిన్న వెలుగు ప్రకాశించినది. దానికి దగ్గర చేరగానే, తీవ్రమైన కార్చిచ్చులాగా అనగా దావానలమువలె అయినది. ఆ అగ్నిలో నేను సోఽహమ్ అయి నిలిచితిని అని వ్రాసినారు.

"నాలోని దివ్యతత్త్వపు పువ్వు వికాసము చెంది, పిదప అది సువాసనను, సౌకుమార్యమును, వెన్నెలను వెలార్చజొచ్చిన పిదప దాని కొని ఆనందింపు కోరువారికి నేను తత్ ప్రదర్శకుడుగనే, అంగులీ గ్రాహ్యమగు తొడిమగాను అడుగునబడియుండి కానవత్తును. అప్పుడిది ప్రజ్ఞాచరిత్రమే కానీ, ప్రభాకర చరిత్రము కాదు. ప్రభాకర చరిత్రమైనను, ఆ ప్రభాకరుడు తొల్లింటి నేను గాక వేరొకడే" అని శ్రీ శాస్త్రిగారు ప్రజ్ఞా ప్రభాకరంలో వ్రాసినారు.

**దివ్యద్దివ్య భవత్కృపాగరిమచే దేదీప్య మానంబుగా**
**నవ్యం బైనటువంటి దివ్యపథమున్ నానాట యోగీశ సం**
**సేవ్యంబైనది తారకం బన బడున్ సద్యోగ మార్గంబు మ**
**మ్మే వ్యాధుల్ జెనకంగ నీక నిలుపున్ ఏకార్థ సంధాయియై. – శ్రీ శాస్త్రిగారు**

దివ్యాతిదివ్యమైన, మహోన్నతమైన మీ కృపచే అనగా మాస్టర్ గారి కృపచే, మహోజ్వలంగా వెలుగొందుతున్న నూతన దివ్యమార్గము ఎన్నో కాలములలో ప్రాంతములలో ఆరాధింపబడినవి. కొలవబడినవి. అనుసరించబడినవి. ఈ సత్ యోగమార్గము భృక్తరహిత తారక రాజయోగము అని పిలువబడుచున్నది. ఈ యోగసాధన మమ్ములను ఎట్టి వ్యాధులకు గురికానివ్వకుండా, ఏకారానికై సంధించి నిలుపుతుంది.

ఇక్కడ నవ్యంబయినట్టి దివ్యపథమున్ అని పేర్కొనడం జరిగింది. మాస్టర్ గారు ఈ తమయోగాన్ని నూతనమార్గము అన్నారు. నవ్యము అను పదముచే ఇది సూచించబడుతున్నది. మాస్టర్ గారు డైరీలలో కొందరు దివ్యవ్యక్తులు కలసి ఈ యోగమును ఆరంభించున్నట్లు వ్రాసినారు. "దివ్యపథమున్" అను పదము దీనిని సూచిస్తున్నది. ఈ యోగసాహిత్యములో వశిష్ఠుడు, గౌతముడు, మైత్రేయి మొదలగు మహాత్ములుతో ఈ యోగమునకు సన్నిహిత సంబంధము కలిగినట్లు పేర్కొనడము జరిగింది. నానాటి యోగీశ సంసేవ్యంబయినది అని చెప్పడంలో పైన పేర్కొన్న విషయమును సూచించుచున్నది.

'ఏ వ్యాధులన్ చెనకంగనీక' అనగా జరా-వ్యాధి-మరణములకు అతీతముగా ఆకారములో మార్పులేకుండా శరీరమును నిలుపుట అనునది ఇది ఈ యోగలక్ష్యములలో ఒకటి 'ఏకార్థ సంధాయి' అనగా ఏకాగ్ర అంటే ఒక లక్ష్యమునకు లేక "వన్ పాయింట్" కు అంటే ఏకమునకు సంధానిస్తూ అనగా కలుపుతూ ఒక లక్ష్యమును సాధించుటకు ప్రయత్నించడము అని చెప్పుకోవచ్చును. ఈ యోగములో "వన్ పాయింట్"కు చాలా గొప్పస్థానం వుంది. ఈ యోగసాహిత్యంలో యోగ క్రమానుగత శ్రేణిని వివరిస్తూ మొదటగా "వన్ పాయింట్" తర్వాత "ఎం.టి.ఎ." తర్వాత మాస్టర్ గారు, తర్వాత మీడియమ్ లు వరుస అని చెప్పబడింది.

**పరమాణువునకు లోపల దాగు సూక్ష్మాత్మ దయసేయవే సూక్ష్మ దర్శనంబు**
**బ్రహ్మాండమునకుఁబైపడి వెల్గు పరమాత్మ దయసేయవే పరదర్శనంబు**
**అఖిలంబు నం దఖి వ్యాపించు విశ్వాత్మ దయసేయవే విశ్వదర్శనంబు**
**ఏకమయ్యు ననేకమై వెల్గు నేకాత్మ దయసేయవే యైక్య దర్శనంబు**
**గ్రుడ్డియెద్దు చేన బడ్డట్టు లిటునట్టు కానలేక ఎట్టో కదచుచుంటి**
**ఆదుకోవె ! సచ్చిదానంద పద మీవె నాథ ! నన్ను నిన్నొనర్చుకోవె !** - శ్రీ శాస్త్రిగారు

ఈ పద్యములో పరమాణువుకు లోపల పరతత్వము సూక్ష్మముగా ఉన్నదని, ఈ బ్రహ్మాండమునకు వెలుపల పరమాత్మ వెలుగుచున్నాడని, సమస్త చరాచర సృష్టిలో పరమాత్మ స్వరూపమైన విశ్వాత్మ వ్యాపించి యున్నాడని, పరతత్వము ఏకమై కూడా అనేక రూపముల భాసించుచున్నదని ఆ సూక్ష్మ దర్శనము, పరదర్శనము, విశ్వదర్శనము, ఐక్యదర్శనమును అనుగ్రహించి సచ్చిదానంద పదవి ఇవ్వమని శ్రీ శాస్త్రిగారు

వేడుకొనుచున్నారు. గుడ్డి ఎద్దు సరిగా చూడలేకుండా చేనులో పడి అటూ ఇటూ తిరుగుతూ అవస్థ పడుచున్నట్లుగా తన పరిస్థితి ఉందని, తన్ను(తనను) ఆదుకోమని ఆర్తితో శ్రీ శాస్త్రిగారు ప్రార్థిస్తున్నారు. ఆధ్యాత్మిక పథములో ముమ్ముందుకు సాగుటకు వికాసము పొందుటకు తీవ్రమైన తపన, భగవంతుని అనుగ్రహము అవసరము. అవి లేకుండా ముందుకు సాగలేము. సాధకులు ఆధ్యాత్మిక వికాసమునకై తపనతో భగవంతుని అనుగ్రహముకై తీవ్రంగా తపించాలని ఈ పద్యము ద్వారా అర్థమౌచున్నది. తీవ్రమైన తపనయే తపస్సు.

పరమాత్మ అనునది సత్. ఒక సత్తా కాదు. ఈ పరమాత్మ అనగా సమస్తములో ఉన్న సచేతన ఆవశ్యకపు ఉనికి లేక మనుగడ. ఇది పరబ్రహ్మము యొక్క ఒక మౌలికమైన అంశము లేక భాగము. ఇది నిర్గుణమువైపుకు కొద్దిగా ప్రాధాన్యత యిస్తుంది. దీనిని మనము శాశ్వతముగా అజనితముగా, నిరాకారముగా తన క్రియలలో సాక్షీభూత తత్వముగా చెప్పవచ్చును. ఇది సర్వవ్యాపి ప్రతివిషయములోనూ ఒకే మాదిరిగా ఉంటుంది. సన్నిహితమైనది. శుద్ధమైనది. అస్పష్టమైనట్టిది. దీనిని వైయుక్తికముగా కూడా అనుభూతి తెచ్చుకొనవచ్చును. అయితే అదే సమయములో అది విశ్వగతమైనది కూడా అంతేగాక ఏకకాలములో వైయుక్తికముగ, విశ్వగతముగా, విశ్వాతీతముగా వుండగల్గిన పరబ్రహ్మ పార్శ్వము లేక అంశ ఇది. దీనిని విశాల ప్రశాంతముగను లేక అపార నిశ్శబ్దముగను, శుద్ధమైన నిష్క్రియాస్థితిగనూ సాక్షాత్కరింప చేసుకొనుట యనేది సమస్త సత్యము కాదు. దీనిని శక్తిగను, జగత్ యొక్క ఉనికిగను, పృథ్వి కార్య-కలాపముల క్రియారూపముగనూ కూడా సాక్షాత్కరింప చేసుకొనవచ్చును. సమస్త విషయముల ఆకారముల పరమాత్మను, విరాట్ స్వరూపము లేక విశ్వాత్మమగుగను చెప్పవచ్చును.

ఆధ్యాత్మిక, వేదాంత యోగ సాహిత్యముననుసరించి సమస్త ఆకారములను, రూపములను సృజించు దానిని "హిరణ్యగర్భ" అంటారు. వీనినన్నింటిని తనలో పొందుపరచుకున్న సచేతన కారణము లేక మూలముగా జీవాత్మను నిర్ధారీకరించు పరమాత్మ అంశను ప్రజ్ఞ అని చెప్పవచ్చును. వీటినన్నింటికి అతీతమైనది, నిరపేక్షము లేక అప్రమేయము. జీవాత్మ మనస్సు, ప్రాణము, శరీరములకు ఆధారముగా ఉంటుంది. యదార్థమైన సత్తా ఒకటి లేక రెండు అంశములుగా అనుభవములోనికి రావచ్చు. 1. పరమాత్మ కాగా, 2. జీవాత్మ. జీవాత్మనే అంతరాత్మగను, చైతన్య పురుషుడుగను చెప్పవచ్చును. సూక్ష్మము కంటే సూక్ష్మముగా వున్న ఈ పరబ్రహ్మతత్వమును సూక్ష్మాత్మగా చెప్పుకోవచ్చును. ఆ పరబ్రహ్మతత్వమే ఆ ఏకతత్వమే లేక ఆ వన్ పాయింట్ అనేది బహిర్ముఖముగా, బహుముఖముగా కూడా కొనసాగుతుంటుంది. ఈ యోగములో బహిర్ముఖముగా సాగుచున్న బహుత్వమును సాగనిచ్చుచునే, అంతర్ముఖముగా దిరిగి అందేకత్వమును గుర్తించి వర్తించుట, ఈ యోగసాధనమునకొక ఫలితము". (చూ. ప్రజ్ఞాప్రభాకరము) ఆధ్యాత్మిక పథములో, యోగపథంలో మరింతగా క్రమముగా పురోగతి సాధించే కొలది, ఆ పరబ్రహ్మతత్వమే, ఆ ఏకమే

అంతరాత్మగనూ, సూక్ష్మాత్మగనూ, ఏకాత్మముగనూ(అనేకములో వ్యక్తమైన ఏకాత్మగనూ), విశ్వమునంతయు వ్యాపించిన చరాచర సృష్టిలోని విశ్వాత్మగను, బ్రహ్మాండమునకతీతంగా అనగా విశ్వమునకు అతీతముగా, అవ్యక్తముగా ఉన్న పరమాత్మగనూ, అనుభవములోనికి వస్తుందని యోగిపుంగవులు, మహర్షుల భావన.

**"ఏకమేవాద్వితీయం బ్రహ్మ". "అహం బ్రహ్మాస్మి". "సోఽహం బ్రహ్మ". "ఈశావాస్యమిదం జగత్".** మొదలగు వేదాంత భావనలన్నీ కూడా దీనినే వ్యక్తము చేయుచున్నది. అవ్యక్తమైన ఆ పరమ దివ్యతత్వము వ్యక్తమైనపుడు, మొదటి స్థితి సచ్చిదానందస్థితి అని విజ్ఞులంటారు. మహర్షి, మహానుభావుడు, యోగిపుంగవుడు సాహిత్యపుంభావ సరస్వతియైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఎంతో అపురూపమైన యోగభావములను అద్భుతముగా ఈ పద్యము ద్వారా యోగసాధకులకు అందించారు. మాస్టర్ గారు "మాస్టర్స్ సెల్ఫ్ డెవలెప్ మెంట్" అనేది మీ లక్ష్యములలో యనగా సాధకుల మనస్సులలో, ప్రార్థనలో లక్ష్యములలో స్థిరంగా, నిరంతరంగా, ఏకైకలక్ష్యంగా వుండాలని పేర్కొన్నారు. దీని అర్థమేమంటే మనలో మాస్టర్ గారి దివ్యతత్వమనేది మరింతగా, మరింతగా సదా సాధకులలో సమృద్ధి వికాసము చెందాలని, వ్యక్తము కావాలని అర్థము. ఇదే భావమును, "నాథా ! నన్ను, నిన్ను పొనర్చుకొనవే" అనుటలో శ్రీ శాస్త్రిగారు వ్యక్తము చేస్తున్నారు. **(ప్ర.ప. ఉపక్రమములో ఇలా వ్రాయబడినది).**

ఎంతో అపారమైన యోగానుభవములున్నప్పటికీ శ్రీ శాస్త్రిగారు గుడ్డెద్దు చేనబడ్డట్టుగా తన పరిస్థితి వుందని వ్రాశారు. ఇది ఆయన వినమ్రతను, అహంకారలేమిని అనగా లేకపోవుటను సూచిస్తుంది. పరబ్రహ్మ తత్వమనేది అనంత ముఖములుగా సాగునది. దానిని స్పష్టముగా ఇంతమాత్రమే అని చెప్పడము పరిమిత చట్రములో బంధించడము సరిగాదు. అది అసాధ్యము. అందుకే శ్రీ శాస్త్రిగారు ఇలా వ్రాశారు. ఈ యోగము ఆత్మ ఉద్బోధకము అయినది.

"సత్యజ్ఞానానందాత్మకమగు పరతత్వము తత్ప్రతికూలగతితో అవివేక జీర్ణారణ్యమునఁ జిక్కి చీకాకు పడుచున్న యనదను నన్ను త్రోవకు దెచ్చి కాపాడిన తీరును మిత్ర గోష్ఠిలో విన్నవించుట కొరకే నా యీ గ్రంథరచన ప్రయత్నము. దీని రచనమున నాకు పురుషోత్తముడగు గాంధి స్వచరిత్ర రచనా విధానము దారి దివ్వె. గులాబి మొగ్గను గడుపున బెట్టుకొని దాని గ్రమ్ముకొని కరకు నూగు తొడిమ రేకే తొలుత గానవచ్చినట్టుగా ఉపక్రమమున నిందు ప్రభాకర నామాఁకుడనగు నేనేకావత్తును గాని, నాలోని దివ్యతత్వపు బూవు వికాసము చెందిన పిదప, దాని గొని యానందింప గోరువారికి నేను తత్ప్రదర్శకుడనుగానే, యంగులీ గ్రాహ్యమగు తొడిమనుగానే యడుగున బడియుండి కానవత్తును. అప్పుడది ప్రజ్ఞా చరిత్రమే గానీ, ప్రభాకర చరిత్రముగాదు. ప్రభాకర చరిత్రమైననూ ఆ ప్రభాకరుడు తొల్లింటి నేనుగాక వేరొకఁడే." శ్రీ మాస్టరుగారు యిలా యన్నారు.

"నా యోగమార్గమును బరిపూర్ణముగా గుర్తించుట యెవ్వరికిని సాధ్యముగాదు. అది నాకు గూడా అప్పుడప్పుడు దెలియనగునదిగా నుండును. శాఖోపశాఖలుగా బెరుగగల మఱ్ఱిచెట్టునకు ఎన్నాళ్ళకేదిక్కున నేశాఖనది వెలయింపగలదో తెలియనట్టే లోకతంత్రమున, మరి యీ యోగతంత్రమున వికాసముందును. మానవుడు ఈశ్వరతను జేరబోవు కొలదిని దానిని దెలియగల్గవచ్చును".

శ్రీ శాస్త్రిగారి ప్రజ్ఞ బహుముఖములుగా ప్రసరించినది. వారు నిజంగా సత్యాన్వేషకులు, కళారాధకులు, సదా ఉత్సాహవంతులు. వారి ప్రతి పనిలో ఈ స్వభావము స్పష్టంగా కనబడేది. భారములంతా కూడా భగవంతునికి అప్పజెప్పి జీవితమును గడిపినారు. శ్రీ శాస్త్రిగారు, వ్యక్తులకునూ, వ్యాధులకునూ ట్రీట్‌మెంట్ చేయడమే కాకుండా దేశ సమస్యల పరిష్కారానికి కూడా గాఢమైన తపస్సు చేశారు. రాయలసీమ కరువును గూర్చి, భారతదేశ స్వాతంత్ర్యాన్ని గురించి వారు తపస్సు చేశారు. ట్రీట్‌మెంట్ వివరాలు 'మణిమంజరి', 'ప్రజ్ఞా ప్రభాకరము', 'ప్రభాకర ప్రవచనములు' అను గ్రంథాల్లో మనకు లభిస్తాయి.

శ్రీ కొత్త వేంకటేశ్వరరావుగారికి అక్టోబరు-1945 రాసిన లేఖ... లో శాస్త్రిగారు ఇలా పేర్కొన్నారు... "మీ ప్రయాణము సంక్షోభము, దేశ విప్లవము ముందు నా శరీరంలో జరిగినది కదా! మీరు అక్కడ చాలా కష్ట, నష్టాలకు పాల్పడి ఉందురు. ఇక్కడ నాకై నీవు చాలా శ్రమ పడితివి. సి.వి.వి. దివ్య అనుగ్రహము మిమ్ము సంరక్షించు గాక... నిబ్బరించుకొంటున్నాను. ఈ జాబును బట్టి శ్రీ శాస్త్రిగారి యోగశక్తి విస్తరించి భారతదేశ సంక్షోభాన్ని సరిదిద్దే ఆధ్యాత్మిక శక్తిగా పనిచేయడం ఆరంభించినదని తెలుసుకొనవచ్చును. దేశంలో ఆలజడులు, ముందు / ముమ్ముందుగా వారి శరీరంలో ప్రతిఫలించేవి. వాటిని నిబ్బరించుకోవడంలో వారికి తిరిగి స్వస్తత కలిగేది. సమిష్టి జీవనానికి వారి వ్యక్తిగత జీవనము ఒక సూచికయైనది.

శ్రీ శాస్త్రిగారి వద్దకు ట్రీట్ మెంట్ కై అనుదినము అనేకులు వచ్చేవారు. వారిలో రిక్షా లాగువారు, కసవు ఊడ్చుకొను వారు, ఆఫీసు గుమస్తాలు, ఆఫీసర్లు, ఉపాధ్యాయులు, డాక్టర్లు, ఇంజనీర్లు, సనాతనులు, కమ్యూనిష్టులు, రాజకీయవాదులు, విద్యార్థులు పలురకాలవారు ఉండేవారు. తేలుకాటు, వడగాల్పులు, గాలి సోకు, టైఫాయిడ్, పరిణామశూల, పైత్యకోశమున రాళ్ళు, నంజు, జలోదరము మొ॥గు అన్ని బాధలను శ్రీ శాస్త్రిగారు యోగప్రార్థన చేతనే చక్కబరచెడివారు. ప్రముఖ పురాతత్వశాస్త్ర పండితుడు శ్రీ రామచంద్ర గారు, విస్సా అప్పారావు గారు ప్రముఖ కళాకారుడు చిత్తూరు నాగయ్య, ఆనాటి మద్రాసు హైకోర్టు చీఫ్ జైస్ పాకాల రాజమన్నార్ గారు మొ॥గు వారందరూ శ్రీ శాస్త్రిగారి వద్ద ట్రీట్మెంట్ తీసుకున్నవారే.

నెల్లూరులో న్యాయవాదిగా పనిచేసిన శ్రీ నారాయణరావుగారు చెప్పిన ఉదంతము, చాలా ఆశ్చర్యకరంగానూ, శాస్త్రిగారి ఉన్నత యోగస్థాయిని గురించి వివరాలను అందిస్తుంది. విషయమిది... శ్రీ నారాయణరావు గారి ధర్మపత్నికి అరోగ్యము బాగా లేకుండుటచే ఎవరి సలహాతో నెల్లూరు నుండి తిరుపతికి

శ్రీ శాస్త్రిగారి వద్దకు యోగ ట్రీట్ మెంట్ కై వచ్చారు. రావుగారికి నిష్ఠ, నియమాలు ఎక్కువ. దసరా సందర్భములో ఆయన ఉపవాసము ఉండి పూజలు జరిపేవారు. ఆయన ఇక్కడున్న (తిరుపతి) సందర్భములో దసరా పండుగ రావడం తటస్థించింది. ఉపవాసాల గురించి చెబితే శ్రీ శాస్త్రిగారికి నచ్చదేమో అన్న శంకతో, ఆయన శాస్త్రిగారికి తెలియకుండానే నెల్లూరు వెళ్ళిపోయాడు. ఉపవాసాలతో పూజలు గావించాడు. పదవరోజున ఆయనకు ఒక కల వచ్చింది. కలలో పూజాకలశము నుండి ఒక వెలుగు బయల్దేరింది. రావుగారు ఆశ్చర్యంతో దీనినే గమనించారు. ఆ వెలుగు దేవతాస్వరూపం దాల్చింది. నెల్లూరును వదలి, తిరుపతి వైపున వచ్చింది. రావుగారు అదే గమనించుచున్నారు. హఠాత్తుగా ఆ దేవత శ్రీ శాస్త్రిగారి కడుపులో ప్రవేశిస్తూ, “నాయనా! మేమంతా మిమ్ములను ఇక్కడికి తీసుకొని రావలసిన వారలమే” అని చెప్పింది. ఎంతగానో ఆశ్చర్యపోవడము నారాయణరావుగారి వంతైంది. నారాయణరావుగారు స్వయంగా ఈ ఉదంతాన్ని తిరుపతి ప్రార్థనా సమావేశ గోష్ఠిలో చెప్పారు. దీనివలన శ్రీ శాస్త్రిగారి ఘనత అర్థమౌతుంది.

ఇంకొక సందర్భములో పిల్లవాడు తీవ్రజ్వరంతో బాధపడుతున్నపుడు తిరుపతిలో వారి తల్లిదండ్రులు భక్తితో శ్రీ శాస్త్రిగారిని స్మరిస్తే గుంటూరులో సాహిత్య సమావేశాలకు హాజరైన ఆయన శరీరములో ఉష్ణోగ్రత తీవ్రమయినదని ఆయన వేడిని తట్టుకోవడం కోసం నీటి తొట్టిలో దిగినాడని ఆయనతోపాటు ఉన్నవారు పేర్కొన్నారు. వీరి ప్రేమ స్మరణ అక్కడ ఆయన శరీరంలో ప్రతిఫలించింది.

ఆధ్యాత్మిక విజ్ఞానములో ఆత్మకు సంబంధించిన జ్ఞానంలో 3 ముఖ్యమైన దశలు(లేక) సోపానాలు ఉన్నాయి. ఇవి ఏకరూపములైన జ్ఞానంలోని మూడు(3) భాగాలు. ఇందులో మొదటిది అంతరాత్మను కనుగొనుట. అహంకార స్థానంలో దివ్యమైన అంతరాత్మను మన అంతరంగంలో ప్రతిష్ఠించుట. రెండవది అజనితమై ఉన్న మనలోని శాశ్వతాత్మ. అవి ఇతర జీవాత్మలతో ఏకమై ఉన్న ఏకాత్మగా సాక్షాత్కారం పొందుట. విశ్వచేతనతో సమైక్యం పొందుట. మూడవది మనలోని అంతరాత్మగా ఉన్న దివ్య విస్ఫులింగముల శాశ్వతాగ్నిగా పరిణమించుచున్న జ్వాల.

ఈ శాశ్వతాగ్ని యొక్క వెలుగు, శక్తి, ఆనందము, అందముల యొక్క ఎఱుకగల పనిముట్లుగా మన అంతరాత్మలో నిక్షిప్తమై ఉన్నది. మనలో అంతరాత్మగా ఏది ఉన్నదో అది వ్యక్తిగతము, విశ్వగతము, విశ్వాతీతమైనది కూడా. ఇదియే పరాత్పరుని ఎఱుక సాక్షాత్కారము పొందుట. తైత్తిరీయ ఉపనిషత్తు, 5 కోశాలను పేర్కొంటుంది. అవి (1) అన్నమయ, (2) ప్రాణమయ, (3) మనోమయ, (4) విజ్ఞానమయ, (5) ఆనందమయ కోశాలు. ఈ కోశాలను భూమికలు పురుషులు అని పేర్కొనవచ్చును. ఉదా:- అన్నమయ పురుషుడు. పై భూమికలోనికి పెరగడమే కాకుండా పై భూమికలోని సత్తా తనలోని ఉన్నతాత్మశక్తిని, క్రింద భూమికలోనికి ప్రసరింపజేయడము. అప్పుడు మన సామాన్య స్వభావము మార్పు చెంది మన ప్రకృతిలో మార్పు వస్తుంది.

మొత్తముపై శ్రీ శాస్త్రిగారి జీవితాన్ని పరిశీలిస్తే ఈ భావాలు మనకు తోస్తాయి. బాహ్యములో కర్తగా, అంతరంగములో అకర్తగా ఉండడం, పవిత్రమైన ఆలోచనలతోనూ, అహంకార రహితుడై ఆకాశములా నిర్మలంగా ఉంటూ ఈ లోకములో సంచరిస్తూ ఉదారుడుగా సామాన్యుడుగా ఇతరులు నా బంధువు ఇతడు కాదు అనే అల్పబుద్ధి లేకుండా ఉదార చరిత కలిగి ప్రపంచాన్నంతా కుటుంబంలా భావించేవాడని అర్థమౌతుంది.

**"అయం బంధురయం నేతి గణనా లఘుచేతసాం ।**
**ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకం ॥"**

– మహోపనిషత్తు

**మునిగోటి వేణుగోపాల్**
రిటైర్డ్ ప్రిన్సిపాల్,
కేంద్రీయ విద్యాలయం, నెల్లూరు.
మొబైల్:- 8790065158
శ్రీపాద అపార్ట్ మెంట్, వరదరాజనగర్,
తిరుపతి. - 517501

## వేటూరి ప్రభాకరశాస్త్రి ఆంధ్రలిపి సంస్కారములు విశ్లేషణ

- వెలిదండ్ల నాగమంగాదేవి,

**"ఆంధ్రభాష అమృత మాంద్రాక్షరంబులు**
**మురుపులలుకు గుండ్రముత్తియములు,**
**ఆంధ్రదేశమాయురారోగ్యవర్ధకం**
**ఆంధ్రజాతి నీతి ననుచరించు"**

తెలుగు సాహిత్యమున ఆంధ్రజాతిపై ఇంతటి అభిమానమును కురిపించిన విమర్శకాగ్రేసరులు, పరిశోధక పరమేశ్వరులు అయిన వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తెలుగు లిపి విషయమున నూతన సంస్కారములను అందజేసారు. ఆంధ్రదేశమున సంఘ సంస్కరణోద్యమం, సాహిత్య సంస్కరణోద్యమం వాడుకభాషా ఉద్యమాల ప్రభావంతో కళాసాహిత్య రంగాలలో పునరుజ్జీవనం ప్రారంభమైన కాలంలో ప్రభాకరశాస్త్రి గారు తమ సాహిత్య ప్రభాకర మయూఖములను ప్రసరింపజేసారు. పరిశోధన రంగంలో, విమర్శనా విధానంలో, శాసన పరిష్కారాలలో, జానపద వాఙ్మయ సేకరణలో కవితా సృష్టిలో లిపి సంస్కరణలలో వీరిది అందివేసిన చేయి. వీరు లిపిశాస్త్ర ప్రవీణులు.

సాధన మార్గంలో ఉన్న మహానుభావులకు తప్ప సుసాధ్యంకాని సాహిత్య కృషి వీరిది. మాస్టర్ సి.వి.వి. సాధనా మార్గంలో పయనిస్తూ భాషా సాహిత్య పరిశోధనలను తన మార్గంతో నడిపించిన సాధనా శక్తి వారిది. జీవనమార్గంలో నిగర్వి అయిన ప్రభాకర శాస్త్రి గారు నరసరావుపేట సారస్వతి వారి "విమర్శకాగ్రేసర" బిరుదును ప్రకటించారు. "సన్మానాలు, బిరుదాలు, మత్తు పదార్థాల వంటివి వీటితో విర్రవీగితే నేను ఇంతవాడిననే గర్వమును రేకెత్తిస్తాయి. ఈ మత్తులో ఏ పని సాగదు". అయినా నాకీ బిరుదములేమిటి అని తిరస్కరించారు. జీవితమున ఎంతటి నైరాశ్యము ఎదురైన

**"చదివితి కష్టముల్ సయిచి శక్తి కొలందిని సంస్కృతాంధ్రముల్**
**పదు-వురు మెచ్చునట్లు భయభాషలయందుగవిత్వమల్లుదున్**
**చదివిన లాభమున్ గవిత సల్పిన లాభమునెంచి చూడగా**
**దుద కొక పొట్టకేని సరితూగని వేతన మేమి సెప్పుదన్"**

అన్నప్పటికి యోగానందము అనుభవించుట వలన ఆ నైరాశ్యమును ఆయన అధిగమించి సారస్వత సేవ చేసారు.

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తెలుగు లిపి పైన దృష్టి సారించి ఆనాటి కాలమున వాడుకలో నున్న తెలుగు లిపి అభ్యసించటంలో ఎంతకష్టమును ఎదుర్కొనవలసి వస్తుందో కూలంకషంగా చర్చించి, ఎలా నేర్చుకుంటే సులభతరమౌతుందో చక్కని సూచనల ద్వారా మార్గదర్శనం చేసారు. మన తెలుగు లిపిలో ఉన్న అసౌకర్యము గుర్తించి తెలుగు భాషా లిపిని నేర్చుకునే విద్యార్థుల కోసం కొన్ని విషయాలను అందించారు. లిపి నేర్చుకునే బాలురకు వర్ణమాలలో అచ్చులు నేర్చుకొనుటలోని కష్టమును గుర్తించి సంస్కరణకు బాటలు వేసారు.

1. అచ్చులలో హ్రస్వములు, దీర్ఘములను సునిసితముగా పరిశీలించి అవి నేర్చుకొనుటలో కష్టమును ఈ విధముగా సూచించారు.

| హ్రస్వము | దీర్ఘము | |
|---|---|---|
| అ | ఆ | ఇవి పోలిక గలవి |
| ఇ | ఈ | ఇవి పోలిక లేనివి |

హల్లులతో పోలివున్న అచ్చులు

| అచ్చులు | హల్లులు | |
|---|---|---|
| ఇ | ఇ | పోలిక కలిగి వున్నవి |
| ఋ, ౠ | బు, బూ | " |
| ఒఓఔ | జ | " |

హల్లులతో పోలివున్న హల్లులు

| హల్లులు | హల్లులు | |
|---|---|---|
| ఖ | | తలకట్టు లేదు |
| ఘ | ఫ, పు, ష, ఘ | పోలివున్నవి |
| ఝ | రు, ఠ | పోలివున్నవి |
| ట | ఠ | పోలికలేనివి |
| త | థ | పోలికలేనివి |

ఈ విధంగా అచ్చులలో కొన్ని, హల్లులలో కొన్ని పూర్తిగా పోలికలేనివి తలకట్టు లేనివి, వేరే వర్గాక్షరములతో పోలివున్న హల్లులు ఉండటం వలన లిపి నేర్చుకొను బాలురకు ఒక సంకట స్థితి ఏర్పడుతుందని లిపి విషయమున సంస్కరణలు చేయవలసిన అవసరం ఉందని ప్రభాకర శాస్త్రి గారు సూచించి తమ సూక్ష్మణ దృష్టిని గుణింతాలపై కూడా ప్రసరింప చేసారు.

గుణింతాల విషయములో ఒక హల్లు వర్ణము, అచ్చు వర్ణముతో కలవడం అనేది జరిగినప్పుడు హల్లును స్వతంత్రముగా ఉచ్చారణ కలిగిన అచ్చుతో కలిపి అక్షరంగా మార్చేటప్పుడు క్ అనే హల్లును.-

క్ + అ = క

క్ + ఆ = కా

క్ + ఇ = కి

క్ + ఈ = కీ

క్ + ఉ = కు

క్ + ఊ = కూ

క్ + ఋ = కృ

క్ + ౠ = కౄ

ఇక్కడ - కా, కి, కీ అనే అక్షరాలకు తలకట్టు లేదుకదా? మరి కు, కూ, కృ, కూ అనే అక్షరాలకు తలకట్లు ఎందుకు అనే ప్రశ్నను సహేతుకంగా సంధించారు. అంతే కాకుండా తెలుగు లిపి నేర్పించు అధ్యాపకులు కృ అనే అక్షరాన్ని కకార, అకార, ఋకారములు కృ అని విద్యార్థులకు నేర్పిస్తున్నారని కాని ఋకారము అచ్చు అయినప్పుడు 'క' కారమునకు 'ఋ' కారమిస్తే 'కృ' కదా అని వారి భావన. అధ్యాపకులు పై విధంగా నేర్పించటానికి కారణం 'క' అనే అక్షరానికి తలకట్టు ఇవ్వడం వలన అది కకారమయ్యి ఆ తరువాత కృ కారముగా భాసిస్తుంది. అనే భావనకు లోనవుతున్నారు. అందుకే గుణింతాలలో తలకట్టు అవసరమా ? అనే ప్రశ్నవేసి తెలుగువారినిఆలోచింపచేసారు.

సంయుక్త అక్షరములు - ఇక సంయుక్త అక్షర ముల విషయములోకి వస్తే వాక్స్వాతంత్ర్యము అనే పదంలో 'క్స్వా' అనే అక్షరాన్ని క్ + స్ + వ్ + ఆ అన్నప్పుడు దేవనాగరి లిపిలో చివరి 'వ' కారము అచ్చుతో కలిసి కకార సకారములు క్రింది ఒత్తులుగా వుండును. కాని తెలుగులో కకారము అచ్చుతో కలిసి సకార వకారములు ఒత్తులుగా వచ్చును. దీని వలన ఉచ్చారణ ఒక రకముగా, లిపి మరొక రకముగా

